# భావగీతావళి



COMPLIMENTARY COPY

రచయిత :

బులుసు భావనారాయణ

సర్పవరం

కాకినాడ-3

# మంచిమాట

కవులెందరో - రచనలెన్నో - పాఠకులెందరో ఈ గొలుసు ఆనాడు, ఈనాడు, ఏనాడూ సాగుచునే ఉంటుంది సృష్టి సూక్ష్మముగానుండి క్రమముగా ప్రపంచంగా పరిణమించుచుండుట మన కెల్లరకు అవగతమే - అట్లే కావ్యోద్యాన ప్రపంచము బహువిధాలైన పుష్పసంతతులతో విరాజిల్లుచునే ఉంటుంది.

కళదైవదత్తము. "ప్రపేదిరే ప్రాక్తన జన్మవిద్యా" అని కాళిదాస వాక్యానుసారిగా గతజన్మ సుకృతంచే ఒక్కొక్క కళ ఒక్కొక్కరి యందు వికసించి పరిమళాల వెదజల్లుచుండును- అట్లే యీ గేయ కావ్యరచయిత కలమునుండి జాలువారిన రచనా ప్రసూనాలు బహువిధ వర్ణాలతో విరాజిల్లుచు తావుల వెదజల్లుచున్నవి. ప్రార్థనతో ఆరంభమై మంగళముతో సమాప్తమగుచున్నది.

ఈ రచయిత రచనలు నానా విషయ సమన్వితాలు, కొన్ని పౌరాణికములు - కొన్ని రాజకీయ సంబంధితాలు కొన్ని మాతృభూమికి, స్వార్థరహిత దేశ స్వాతంత్ర్యయోధులకు - కొన్ని కవికుమారులకు- కొన్ని తత్వబోధకములు- భక్తి ప్రబోధకములు మున్నగున్నవి.

రచనలన్నియు వచన కవిత్వధోరణిలో నలరారుచున్నవి. నేటి జనలోకము సులభముగా నర్థముచేసికో గలుగునవై మృదుమధుర పదజాల సమన్వితమై యున్నవనుట వాస్తవమేగాని

స్తవముగాదు. శ్రీమద్రామాయణ మహాభారత గాథలను సంక్షిప్తముగా గేయగతిని రచించి జనసామాన్యమునకు మన సంస్కృతి పట్ల ఆదరాభిమానములు కలిగించుటయే కవిగారి యుద్దేశము. మహాభారతమను శీర్షికలో 27 గేయములు - కవితాకాశంలో 27 నక్షత్రములవలె ప్రకాశించు చున్నవనుటలో సందేహం ఆవంతయూ లేదు-

'కుంతి' యను ఖండికలో కవిగారు "రమణులచిత్తము లెట్లుండునో నలుమోములుగల బ్రహ్మదేవుడుగూడ ఊహింపలేడు. అను వాక్యము సార్థకము - 'కర్ణ' యను ఖండికలో కవియెంత వాపోయినాడో - కోల్పోతివి తల్లిని, గుర్తింపు జాతిలేనివాడ వైతివి - మిత్రసహాయార్థము తల్లిప్రార్థనను భ్రాతలను తుదకు అసువులనుగూడ బాసెనని వాపోయినాడు-

కర్ణుడు శ్రీకృష్ణునితో వాకొన్న పలుకులు కర్ణుని మనోదార్ఢ్యమును విశదపరచుచున్నది. ఓదార్పు అను ఖండికలో సరిలేరు నీ కేలోకమందు, నీకంటనీరొత్త లోకులేకాదు నాకలోకవాసులుగూడ గుమిగూడినారు అని కవి తన సహృదయతను వెల్లడించినారు.

తత్వమను శీర్షికలో దైవమును నమ్మిన సకల సౌఖ్యములు కలుగునని, తోటి మానవులకు మేలుచేయుమని నీతియె జగతిలో నిలుచునని, లోకనాథుని నమ్ముటవలన సర్వశ్రేయస్సులు కలుగునని చక్కని తత్వబోధ చేసినారు.

ఆంధ్రదేశ పుణ్యక్షేత్రములందలి దేవతా మూర్తులను సంస్మరించుటయేగాక, స్వాతంత్ర్యయోధుల ప్రశంసించి, త్యాగ మూర్తుల త్యాగమును నేటి జనానీకమునకు హృద్గత మగునట్లు చేసినారు.

చదువరులు గ్రంథమును సొంతముగా చదివి కవిగారి కృషిని సార్థకమొనరింతురుగాక! ఈగ్రంథ రచయిత శ్రీ బులుసు నారాయణరావుగారు ఇకముందు గూడ మంచి రచనలను సాగింప భగవంతుడు సంపూర్ణాయురారోగ్యములను ప్రసాదించుగాక!

శ్రీకాకుళం 21-10-92

విద్వాన్, **చిలకా వేంకటకృష్ణదాసు** B. A
రిటైర్డు తెలుగు పండితుడు

---

పురాణ గాధల సదా
పారాయణ చేసిన
హరి ప్రసన్నతకు పాత్రులగుట అబ్బురంబె
నిరంతర మార్గమదె ఎల్లరకు సద్గతుల బొంద

—రచయిత



# మనవి

నేను రచనారంగంలోకి ప్రవేశించేముందు పూజ్యులు శ్రీ॥ శే॥ మాతండ్రిగారు బులుసు అప్పలనరశింహంగారు రచించిన 'శ్రీమత్ రామాయణ భారత, భాగవత సారసంగ్రహం' చదివితిని. అదియే మార్గదర్శకమైనది. "జలధిముందు పిల్లవాగే"మాత్రం? అయినా నాలోని ఉత్సాహం, పట్టుదల వలన సాహసించితిని.

తొలుదొల్త 'సప్తకథల సంపుటి' అనే హొత్తమును (కష్టే ఫలే, స్వామిద్రోహం, భూతలస్వర్గం, కలిమిలేములు, విశ్వాసం మాయాప్రపంచం, సంసారసాగరం) చలనచిత్రాలకి మూలంగా ఉపయోగపడతాయని వ్రాయడమైనది. కాని వాటి ననివార్యకారణాల వలన అచ్చువేయించుట కాలేదు (త్వరలో ముద్రణ వేయబడును).

తదుపరి వివిధ విషయాలను పొందుపరచి 'DAINTY' అనే పుస్తకాన్ని ఆంగ్లభాషలో 1989లో అచ్చు వేయించడమైనది.

పలువురు చదువరులు, మిత్రులు, ఆత్మీయులు ప్రశంసించిరి. అందుకెంతైనా ధన్యుడను.

1) గౌ॥ శ్రీ భావరాజు సర్వేశ్వరరావుగారు

(విశాఖపట్నం మాజీ ఉపాధ్యక్షులు, నాగార్జున విశ్వవిద్యాలయం)

2) గౌ॥ పి. టి వేణుగోపాల్‌గారు

(మాజీ చమురు, వాయువు సంస్థ అధ్యక్షులు, మరియు విశాఖాంకు సభ్యులు)

3) గౌ॥ శ్రీరామకృష్ణ హెగ్డేగారు

(మాజీ కర్ణాటక ముఖ్యమంత్రి, కేంద్రమంత్రి, ప్రణాళికా సంఘం ఉపాధ్యక్షులు)

1974 సంవత్సరములో రైల్వే ఉద్యోగ విరమణానంతరం, యూనిట్ ట్రస్టు ప్రతినిధిగా సేవ లొనరించుటచే పలువురు ప్రముఖుల ప్రఖ్యాతుల మైత్రి, సన్నిహిత మేర్పడుట అమూల్యమైన అవకాశం గొప్ప యోగమే. అందువలన కాలం సద్వినియోగపడటమేకాక ఆర్థికంగా పుంజుకొనుట కెంతైనా దోహదం చేసింది.

రంగంలోకి దిగిన ముహూర్తబలమో, నాభాగ్యమోకాని దరిమిలా 'గేయాలు' 'కథలు యి॥'(ఆధ్యాత్మిక, సాంఘిక, పురాణ శృంగార) వ్రాయుట కుపక్రమించితిని. దైవకృప వలన అవన్ని ఒకతీరులోకొచ్చి అచ్చువేయించుట కారంభించితిని, సహృదయులు ఆప్తులు రచనలో ప్రావీణ్యత కలవారు సహకరించకపోతే యీనా యత్నం సఫలీకృతమగుట అసాధ్యమనుటలో అతిశయోక్తి లేదు.

ముఖ్యంగా పేర్కొనవలసినవారు :-

1) శ్రీ కొల్లూరు అవతారశర్మగారు — కాకినాడ

2) శ్రీ శ్రీపాద శ్రీరామమూర్తిగారు — ,,

3) శ్రీ సామవేదం జానకిరామశాస్త్రిగారు — ,,
(జానకీ జాని)

4) శ్రీ చిలకా వెంకటకృష్ణదాసుగారు — శ్రీకాకుళం

వారికెన్ని వ్యాపకాలున్నా శ్రమేకాక శ్రద్ధవహించి నా రచనలు శుద్ధిచేయడమేకాక అమూల్యమైన సూచనలుచేసిరి. వారికి కడు కృతజ్ఞుడను.

శ్రీ చిలకా కృష్ణదాసుగారు యీ నాగేయాల నామూలాగ్రంగా పరిశీలించి వారి అభిప్రాయాన్ని 'మంచిమాట' ద్వారా వ్యక్తపరచిరి. అట్టి ప్రశంసకు నేను యధార్థంగా ఉక్కిరి బిక్కిరి పడేఅవస్థలో యీదులాడు చున్నాననుట సత్యదూరం కాదు. వారి కవితానుభవం యిత్యాదుల నినుమడించి వ్రాసిరి. వారు నిశ యంగా సంసారసాగరంలో నుండియూ వానప్రస్థ జీవితాన్ని గడుపుచున్న యోగిపుంగవుడు,

నా యీ రచనలు శాస్త్రీయపద్ధతిలోను, ఛందోబద్ధంగాను లేవన్న విషయం యధార్థం. చాలామట్టుకు కందపద్యాల శైలీ, రీతిలో నాభావాలను వ్యక్త పరచడమైనది. వివిధ రంగాల్లో రచనలు సాగినవంటే సరస్వతీదేవి కృపగా భావించితిని. అట్టిది పూర్వ లొనరించిన సుకృతమో, నా భగ్యమో మొత్తానికి ఒక ఒడ్డుకు చేరినట్లాత్మను భూతినొంది ముద్రణ కిచ్చితిని. నాలోనుప్పొంగిన భావాలను పట్టుదలచే ఆరోగ్యమంతగా బాగులేకపోయినా కృషికి లోటులేకపోవుటచే పుస్తకం (మొదటివిడత) పూర్తియైనది. చన్నాతి శ్రద్ధతో వైద్యసేవలొనరిస్తున్న హోమియో డాక్టరుగారు శ్రీ మోచర్ల రామచంద్రరావుగారి కెంతైనా కృతజ్ఞుడను—

"నమ్మి చెడినవారులేరు చెడిన చెడుదురు ననునమ్మకున్న" శ్రీహరి ఉవాచ యధార్థం. 24-10-92 నాడు ఘోరప్రమాదము

నుండి బయటపడ్డాను (పుస్తకం ముద్రిణంలో నుడంగా) దైవానుగ్రిహమేకాక, గొప్ప యోగంకూడా.

ఉన్నతవిద్యా ప్రవీణుడను కాకపోయినా, నాలో ఏ కోశానా జ్ఞానంలేకున్నా ఉత్సాహంతో, సప్తదశ వర్ష జీవితాను భవంతో నాలో పొంగివొచ్చిన ఎనలేని ప్రవాహంతో రచనల రూపొందించి కడు కృతకృత్యుడనైతిని.

కొన్ని అంశాలు కొత్త పోకడలో (నాకు స్ఫురించిన రీతి) వ్రాయ సాహసించితిని. పేరొందిన పలువురి రచనలు, మేధావుల ప్రవచనాలు, ప్రముఖుల యక్షగానాలు యిత్యాదుల నాధారంగా చేసుకొంటినని సవినయంగా మనవిచేయు చున్నాను.

ప్రస్తుతానికి 'భావగీతావళి'ని (ప్రధమంగా) మాత్రమే అచ్చు వేయించడమైనది. మిగతావి అచ్చులోనున్న వనుటకు సంతోషిస్తున్నాను.

తప్పులు, అచ్చుపొరపాట్లు, లోపాలు, చోటుచేసుకున్నం దుకు చింతిస్తున్నాను.

శ్రీ టి. గణేశ్వర్రావుగారు, శ్రీపతి ప్రెస్, కాకినాడ. అందంగా అచ్చు వేయడమేకాక నా పరిస్థితిని గుర్తించి ప్రత్యేక శ్రద్ధ వహించినందుకు కడుధన్యుడను.

1-11-92 భవదీయుడు

కాకినాడ **బులుసు భావనారాయణ**



శ్రీ కోదండరామస్వామి

చదివినది లేశమంతైనన్
చదువులతల్లి కృపచే
కదనరంగమున చనురీతి
మోదముగ రచించెద శ్రీరాముని కంకితముకాగ



జననీ జనకులు

జనకుడు : కీ॥ శే॥ బులుసు అప్పలనరశింహం

నిర్యాణం : 17-9-1955

జనని : పూజ్యురాలు బులుసు లక్ష్మినరసమ్మ

నిర్యాణం : 30-7-1982

# విషయసూచిక

| విషయం | పుటసంఖ్య |
|---|---|

ఓం

# ప్రార్థన

తొలిదొల్త గణనాయకుని నుతించి
కొల్చెద భారతీదేవిని నాపై దయ
చిల్కించమని వేరెకోర్కెలు లేవు
కలకాలము హరిస్మరణదక్క !

కదలిరా దేవాదిదేవ దివినుండి భువికి దాసుల
నాదుకొనగ చేసితిమి పాపములని
మదిని భావింపకు, దోషుల మటంచు
నీదె, భారమునుమీ మము దరిజేర్ప.

చదువులతల్లిని నుతించి
ఆదిదంపతుల నారాధించి గణ
నాథు విఘ్ననాయకుని ప్రస్తుతించి
ఆదినారాయణుని పాదపద్మములకు ప్రెమొక్కెదన్ !

ఆదిదంపతుల అనంగుపుత్రా !
మదిని నిన్ను దలంతురు సదా
నీదయలేకున్న సాగునే ఏకార్యమైన
నాథుడవు నీవె నిశ్చయముగా వినాయకా !

చదువులతల్లి నీ చలువచే
చదువు ఘనతగా లేకుండినన్
నీదయ సౌభాగ్యమని నమ్మి
మొదలిడుచున్నాను భారంబు నీదె భారతీ !

## కవి స్తుతి

పేరొందిన ప్రసిద్ధకవుల్ మును వ్రాసిననేక గ్రంథముల్
వారు దిక్కవంగతులైననేమి వెలుగొందుచున్న వీనాడుకూడ
తారలై నిలుచు వారికీర్తి యుగాంతరములైన
వారి పదాబ్జములకు మ్రొక్కెద నన్నాశీర్వదింపగా !

## దశావతారములు

వేదముల దొంగలించి జలధిన్
దాచిన సోమకు నంతమొందించి
ఓరించి కేయవె మత్స్యావతారుడవై
జయ జయ నారాయణా ! 1

సురలు నసురులున్ అమృతమును
సాధింప సహాయపడవే మందర
గిరిని మూపునదాల్చి కూర్మరూపుడవై
జయ జయ నారాయణా ! 2

హిరణ్యాక్షుడు ధరన్ చాప
చేతని చుట్టివేయగ రక్షింపవే
వరాహరూపుడవై
జయ జయ నారాయణా ! 3

భక్తప్రహ్లాదుని తండ్రి హిరణ్య
కశిపుడు పలువిధముల బాధలపెట్టగ
స్తంభమున నరసింహరూపుడవై రక్షింపవే
జయ జయ నారాయణా ! 4

మూడడుగులనేల నడిగి
భూమ్యాకాశంబు లావరించి తుదకు
బలిని పాతాళమున కనిపితివి వామనుడవై
జయ జయ నారాయణా ! 5

గోవును దొంగలింప ఇరువదొక్కమార్లు
క్షత్రియులను ఛేదించి తండ్రిఋణము
తీర్చుకొన భార్గవరాముడ వై
జయ జయ నారాయణా ! 6

తండ్రిమాటను పాలింప
రాజ్యమున్ త్యజించి కానలకేగి రాముడవై
రావణున్ చంపి రమణిసీతను దెచ్చితివి
జయ జయ నారాయణా ! 7

బాల్యమున ఎనలేని లీలలందరిని
మోహింపజేచి కంసాదులన్ దునిమి పాండవుల
రక్షించి ధర్మసంస్థాపన జేయవే కృష్ణుడవై
జయ జయ నారాయణా ! 8

భోగముల విడనాడి శాంతి
స్థాపనచేసి రాజన్యుల రమణులన్
అలరించవే బౌద్ధావతారుడవై
జయ జయ నారాయణా ! 9

సజ్జనుల రక్షింప దుర్జనుల శిక్షింప
కలియుగమున అవతరింతువు
లోకము నుద్ధరింప కల్క్యావతారుడవై
జయ జయ నారాయణా ! 10

# శ్రీ మద్రామాయణం

కలడు దశరథు డనురాజు
ఏలుచుండె అయోధ్యను చతురతతో
కలరతనికి ముగ్గురుసతులు కౌ
సల్యా, సుమిత్ర, కైకేయిలు. 1

ఒనరించె క్రతువు సంతానప్రాప్తికై పం
చెను పాయసమును భార్యలకు
కనిరి నల్గురుసుతుల మోదముగ
యినవంశము పావనముగాగ. 2

నామము లిడిరి సప్తఋషులు
రామ భరత లక్ష్మణ శతృఘ్నులని
ఉరమరికలేక పెరిగిపెద్దలై ఎల్ల
రు ముదమొంద విద్యల నభ్యసించిరి. 3

యాగము, నసురులబారి కాపాడ వే
డె గాధిసుతుడు దశరథుని, రామునం
పగ చనెను లక్ష్మణుడు తోడు
రాగ, కాపాడిరి క్రతువును తాటకాదుల దునిమి. 4

సీత పరిణయసభకు కౌశికునితో
చతురులు రామలక్ష్మణులు చనుచుండ
గౌతమునిభార్య అహల్య శాపవిముక్తిజెందె అ
వతారపురుషుని పాదధూళి సోక. 5

శివునివిలు ద్రుంచినవానికి పరిణయము
గావింతు ననినుడివె జనకమహీపతి సభ
కువిచ్చేసిరి పల్వురుప్రముఖులు గా
ని విఫలులై రందరు, రాముడు సఫలుడాయె 6

పరిణయమాయె సీతారాములకు
పరిణయమాడిరి భరత లక్ష్మణ శత్రుఘ్నులుకూడ
గురునానతి నల్గురుమెచ్చ అయోధ్యా
పురిని వేడుకలు జరిగె ముదముగ 7

శ్రీరాముని రాజుగజేయ నిశ్చయించె, ద
శరథుడు యత్నములు చేయ
నారంభించిరి కార్యసిద్ధికై
కోరె కైకేయి తన రెండువరములు చెల్లించమని. 8

శ్రీరాముని కానల కంపుమని
భరతునికి పట్టముగట్టుమని మం
థర దుర్బోధల విని, కైకను దూరిరం
దరు మూర్ఛిలె నృపతి దిగులుతో. 9

కానలకు చనె రాముడు సీతాలక్ష్మణులతో
చనె స్వర్గపురికి దశరథుడు వియోగభారమున
ధన్యుడాయె గుహుడు సరయూన
దిని దాటించి, కానల కడగండ్లపాలైరి, 10

శ్రీరాముని పాదుకలదెచ్చి
భరతుడు నందిగ్రామములో నుంచి పాలించె
వరమిచ్చె రాముడు భద్రుని సేవలనంది తదు
పరి భద్రగిరిని వెలసి దమ్మక్కకు మోక్షమొసగె. 11

పగ తీర్చుకొనగ మారీచుని మాయలే
డిగ ననిపె రావణుండు సీత పర్ణశాలకు
వేగమె హరిణిసపట్టి తెమ్మని పంపె రాముని
జాగగుటచే లక్ష్మణుని కూడపంపె సీత. 12

విచ్చేసె రావణుండు వేషధారియై
చచ్చెర సీతను లంకకు గొనిపోవ
ముచ్చెమటలు బోయమూర్ఛపోయె జానకిని
తెచ్చెను తనవెంట జేర్చె అశోకవనమున. 13

అసురుని గూల్చి తిరిగివచ్చె రాముడు వి
చ్చేసిన లక్ష్మణుని సీతనొంటిగ వదలినందుకు
కసిదీర కోపించె కడుశోకించి రిరువురు
విసిగి వేసారిరి సీతకై వెతకి వెతకి. 14

చేరిరి కిష్కింధ, వాలినిగూల్చి చే
సిరి సుగ్రీవుని రాజుగ, మిత్రు
లైరి వారు, సీతనువెదుక వా
నరమూక నలుదిశలు చనె. 15

వాయుపుత్రుడు హనుమ ననిపిరి లంకకు
వాయువేగముతో కడలిని దాటి చేరెను
వాయునందనుడు వెదకె నలుమూలల తుదకు గ
నిమె సీతామాత నశోకవనమున. 16

కడు ముదమొంది చేరె సీత
కడకు నమ్మించి గురుతుగ రాము నంగుళీయక మిచ్చె
కడుదీనతతో వర్ణించె సీత అవస్థను ధైర్యముగ
నుండుమని తరుణముకై వేచియుండుమని బోధించె. 17

రావణుడు సీతనుచేరి బెదిరించి గ
డువొసంగె నిరుమాసములు తన్ను పరిణయమాడగ,
ఆవేశముతో శోకించె సీత తనస్థితికి వే
డె వాయుసుతుని చెరవిడిపింప అతిదీనతతో. 18

తనమహిమ చూపించి లంకను రూపుమాప
పూనుకొనియె మారుతి సర్వనా
శనముచేసె త్రుటిలో సుందరమగు లం
కను ఉగ్రుడై రావణు డనిపె సైన్యమును 19

కూల్చె నందరిని చతురతతో అతి
బలశాలులందరిని అక్షయకుమారు నంతమొందించె మారుతి
వాలమునకు నిప్పంటిచమని గర్జించె రావణుండు
వాలముతో లంకను పరశురామప్రీతిజేసె. 20

వాహోయె అంజనీసుతుడు తనచర్యకు
కోపాగ్నిని, వాలమునుచల్లార్చి చేరె సీతకడకు
వాహోవగవలదని బలికి వేగమె రామునితో వత్తున
ని పవనాత్మజుండు జనె కిష్కింధకు శుభవార్తదెలుప. 21

ముదమొంది రందరు మారుతి సాధించినపనికి ఆ
నందబాష్పము లిడి, తేరుకొనె రాముడు చూడామణి
నందుకొని
యుద్ధసన్నాహము లొనర్చి పయనించి
రందరు లంకనుచేర కడలిని దాటిరి వానరమూకతో. 22

వారిరాక విని విభీషణుడు
కోరె సోదరుని రాముని శరణొందు మని
పోరు లంకకు చేటని బోధించె, వినడా
యె రావణుండు, చేరె విభీషణుడు శరణొంద రాముని. 23

అతిఘోరముగ జరిగె సంగ్రామము
అంతమొందెను కుంభకర్ణుడు, లంకా
పతి రావణుడుకూడ కూలె లంకాధి
పతిగజేసె విభీషణుని రాముడు నల్వురుమెచ్చ. 24

గడువుదాట చేరెను రాము డయోధ్యకు
వెడలిరి విభీషణుడు సుగ్రీవుడు మారుతి
కూడ ముదమొందిరి కౌసల్యాదిగ జనులందరు
వేడిరి రాముని రాజ్యమేలగ. 25

జరిగెను రామునికి పట్టాభిషేకము అం
దరు సంతసింప కొలువుదీరి కొనియాడె
శ్రీరాముడు మారుతిసేవను సత్కరించె నందరిని త
గురీతిని దీవెనలందె రామరాజ్యము చిరకాలమువర్ధిల్లగ 26

పరనింద బాపుకొనగ సీతను కానలవిడిచె రాముడు
ఇరువురుపుత్రుల లవకుశులను కనె వాల్మీక్యాశ్రమమున బా
లు రోడించిరి రామలక్ష్మణుల యాగహయము బంధించి చి
వరికందరు కలిసిరి సీత ధరిత్రిమాతనుచేరె తనువు
చాలించి. 27

## సుందరకాండ

సీతాదేవి లంకనున్నదని రూఢిగతెలిసి
వెదుకసమర్థుడగు ధీరుడు మారుతిని పంపదలచిరి
అతిప్రయాసముతో జలధిలంఘించి చేరెను హనుమ లంకను
అంతట వెదకి వేసారిపోయెను సీతజాడ కనలేక. 1

అశోకవనము చేరె చివరికి
అశోకవృక్షము కిందచూచె
ఆ శోకించు మాతగుర్తు లెరింగి కర్మ
వశము తప్పదెంతవారికైనన్ అని చింతించి దాపులచేరె. 2

సీతామాత అవనిజాత కడుదుఃఖితై ఉండె
మాత కనుమానము కలుగనటుల ఏ
రీతిని పరిచయము చేసుకొను టుచితమో యోచించి
నుతించసాగెను శ్రీరామునిగాథ- 3

నమ్మెను సీతమ్మ ఈతడు రామదూతయని
రమ్మనె చేరువకు తనగాథను వినిపించె
రామలక్ష్మణుల క్షేమమెరుగగోరె కడుదీనతతో
క్షేమసమాచార మరసి ఊరడిల్లె మాత. 4

రాము డంపిన అంగుళీకము గైకొని ముదమందె
రామునకు గురుతుగ తన చూడామణి నిచ్చె,
రామునితోడ్కొని కడువేగము వచ్చెదనని పలికె హనుమ
రామబాణముచే లంకేశుడీల్గుట తథ్యమని, బాసచేసె. 5

సీతను వేధించ రావణుండువచ్చె తన ఆ
నతిమేరకు చరించుమని గడువిచ్చె లంకా
నేత యిరుమాసముల తదుపరి
చింతించిన ఫలితము శూన్యమనియెః 6

అతిఉగ్రుడై హనుమంతుడు లంకంతయు
వెతకివెతకి రక్కసులగూల్చె
శతవిధముల సైన్యమును, యోధుల నంతమొందించె
హతమార్చెను లంకంతయు బూడిదచేసి. (

సీతామాత ఆనతిగొని చేసె తిరుగుప్రయాణము
అతివేగముతో చేరె ఆవలిఒడ్డునకు
ఆత్రుతతో వేచివున్నవారికి తెలిపె
సీతమ్మ క్షేమవార్త ఎల్లరు ముదమొంద. 8

తెచ్చెను శుభవార్త యంచు
మెచ్చిరంద రానందముతో
మెచ్చుకొని శ్రీరాము డానందబాష్పములతో
మారుతని కౌగలించుకొనియె మోదమలర. 9

## మహాభారతం

కలడు శంతను డనురాజు భరతవంశమున
ఇల నేలుచుండె కడురమ్యముగ
కలిసెను గంగ నొకనాడు పరిణయమాడ
దలచె ఆమె షరతుపెట్టెను, ఏనాడు తనకడ్డు పడవలదని, 1

వల్లెయని పరిణయమాడె జన్మతరియింప
యిల స్వర్గసౌఖ్యము లందిరి
కలగన్నరీతి కవిపారవైచె సప్తవసు
వుల గంగలో, రాజు వారించలేకపోయె. 2

కనె నష్టమవసువును నీట పారవేయ
అనుమతించక అడ్డుపడె నృపతి ఋణము తీరెనంచు
గొనిపోయె శిశువును జనస్థానమునకు పెద్దజేసి యిత్తు
నని. క్రుంగె శంతనుడు వియోగమునకు, 3

పెరిగెను గాంగేయుడు కడుగారాబముగ
పరశురాముని శుశ్రూషజేసి
నేర్చెను విద్యలన్నియు నిపుణతతో లోకమంత
ఔరా యనగ తలచె తండ్రి పట్టముగట్ట, 4

కనె నొకనాడు దాశరాజసుతను శంతనుడు
కన్నియను చేపట్ట నూహించె
అనతీయుమనియె దాశరాజు సత్యవతిపు
త్రుని రాజుకాగ కాదనలేక నృపతి పరితపించసాగె. 5

కారణమెరిగి గాంగేయు డంగీకరించె
ధరగోల్పోవ, సత్యవతిని వివాహమొ
నర్పుమనె తా నెన్నటికి బ్రహ్మ
చారిగ నుందునంచు, పేరిడిరి భీష్ముడని. 6

కనెను వ్యాసుని మున్నె సత్యవతి
కానల కేగెను వ్యాసుడు కోరినవచ్చెద
నని తపమొనర్ప వంశమునిలబెట్ట మనికోర
కనపడె కర్తవ్య మొనర్ప. 7

ధృతరాష్ట్రు డంధుడౌట పాలించె ధర
నతనిసహోదరుడు పాండు, పరిణయమాడె
కుంతి మాద్రుల, కోల్పోయె నసువుల
అతిచిన్న వయసున కిందమముని శాపముచే. 8

కనెను కుంతి కన్నెప్రాయమున కర్ణుని దూర్వాసు
ముని వరఫలితంబుగా రవివలన, విడిచెనుగంగలో
కనిరి కుంతిమాద్రులు పుత్రుల నయిదుగుర
కనెను నూర్గురు పుత్రుల గాంధారి. 9

నేర్చిరి పలువిద్యల గురువులకడ
కురుపాండవులు సమానరీతిగ
యీర్ష్యచెందిరి ఒకరియందొకరు బాల్యమందె
వైరమునకు దారితీసె తదుపరి. 10

పెరిగెను కర్ణు డధిరథునింట
నేర్చె నన్నివిద్యల కడునిపుణతతో
చేరెను పరశురాముని బ్రహ్మాస్త్రమునుపొంద,
మారు కులమనితెలిసి శపించె గురుడు. 11

ప్రతిభలుచాటగ జరిపిరి ప్రదర్శనము
అతినిపుణతతో అర్జునుడు జూపగ
జాతిచిన్నదని అర్హతలేదని కర్ణునిని నివారించిరి
అతని నంగరాజునుజేసి పరువునిల్పె రారాజు. 12

అతిరయమున వేదికకేగి నిరూపించె రాధేయుడు క
రతాళధ్వను లందరుచేసిరి
ఈతడర్జునుకేమాత్రము తీసిపో డనిరి
మైత్రి చేసికొనె సుయోధనుడు రవిజునితో. 13

ఛేదించెను మత్స్యయంత్రము నర్జునుడు ద్రు
పదరాజపుత్రి ద్రౌపదిని పాండవు
లందరు పరిణయ మాడిరి కుంతి కోరికమేర
ముదమొంది రందరు వింతవివాహమునకు. 14

ఓడెను సర్వము ధర్మజుడు జూదమాడి
యిడెను తిరిగి ధృతరాష్ట్రుడు కనికరించి
ఓడెనుమరల శకుని మాయపాచికలచే
పాండవులు చని రరణ్యవాసము అజ్ఞాతవాస

పాండవుల పలువిధముల
యిడుమల పెట్టిరి కౌరవులు లక
నుండ నిప్పుపెట్టిరి ద్రౌపది మ
కష్టపడియె మురారి వారి అం

సలిపి రరణ్యవాసము ద్వాదశ
సలిపి రజ్ఞాతవాస మొక వత్స
కలిమిలేక కడు కడగండ్ల పడిరి
చెలిమిచేసిరి బహుప్రజానీకముతో

చేరిరి సుఖముగా నింటికి రాయ
బారమొనర్చి తమ పాలిప్పించుమని
మురారిని వేడిరి భారముమోపి
శౌరి చనెను హస్తినాపురి కందరి హితముగోరి. 18

స్వాగతమిచ్చిరి గోవిందునకు ఘనముగ
గాంగేయుని సమక్షమున సూచించెను,
సగభాగమిచ్చుట సమంజసమని
గాంగేయుడు కూడ ఉచిత మనెను. 19

ఐదూళ్ళిచ్చుటకు కూడ సమ్మతించడాయె
మాదాంధుడు సుయోధనుడు, గురువులు
విదురుడు కులక్షయమగునని వారించినన్
బోధలన్నియు పెడచెవినిబెట్టె కీడుమూడగ. 20

యత్నించిరి శౌరిని బంధింప
నీతిగరపెను తనమాయజూపి మురారి
ధృతరాష్ట్రునకు జూపె విశ్వరూపమును
అతివినయముతో నామమాత్రుడనవె అంధనృపతి. 21

బోధచేసె కర్ణున కనేకవిధముల
మాధవుడు పాండవులతో కలయుమని
రాధేయు డంగీకరించడాయె కుంతికూడ
బోధించి అర్థించె పుత్రభిక్షపెట్ట. 2[illegible]

జాతిపోయె నీవలన నన్ను
నీతికూడ విడనాడమనుట పాడిగాదనెయె
చత్తు రాధేయుడనై అర్హతలేదు
కౌంతేయుడ ననిపించుకొనగ 23

పోరు నిశ్చయించి రిరుపక్షములు
చేరి రిరుపక్షముల బంధువులు మిత్రులు
మురారి అండగానుండెదనని బాసచేసెను పాండవులకు
కర్ణుడుండ లోటులేదనుకొనిరి కౌరవులు. 24

అతితీవ్రముగ సాగెపోరు అభిమన్యుని
అంతమొందించిరి పద్మవ్యూహమున గంగా
పుత్రుడస్త్రము విసర్జించె శిఖండిని జూచి
పుత్రవియోగ వార్త విని అశువులబాసె ద్రోణుడు. 25

కూలి రనేకయోధు లిరుపక్షముల
నీల్గె కర్ణుడు రథచక్రము ధరచిక్కుగొనగ
కలిగె నెనలేని శోకము కుంతికి
తెలిపె ధర్మజునకపుడు కర్ణుని గాథ. 26

ముగిసె పోరు శల్యపతనానంతరము
ఏగిరి నిజస్థానముల కందరు వైభవ
ముగ జరిగె ధర్మజునకు పట్టాభిషేకము సుఖ
ముగ నుండి రందరు తదుపరి. 27

— —

# శ్రీకృష్ణ రాయబారం

బావా! మాకన్ని విధముల దిక్కు
నీవె వేరెగత్యంతరములేదు కాపాడ
రావా యిక్కట్టులబారి దీనబాంధవా!
నీవారము మేమందరము భారము నీదె సుమీ. 1

సంధిజేయు బాధ్యత నీపై నిడితిమి కౌరవ
నాథుతో సాకల్యముగా ముచ్చటించి
ఐ దూళ్ళొసగినన్ చాలుమాకు సుఖము
లేదు పోరుసల్పిన అనివార్యమైన చేటుచేకురు. 2

వల్లె అని శౌరి అంగీకరించె మోద మలర
తెల్పుడు మీసాంకేతముల తేట
తెల్లముగ సాధ్యమైనంతవరకు సాను
కూలముగా పరిష్కరించెద సమస్య సర్వసమ్మతంబుగా. 3

ధర్మరాజు

తనబిడ్డలతో సరిచూచుకొానెను
యీనాటివరకు కౌరవనాథుడు ఎటు
లైనన్ తనవారిగ భావించి గతముమరచి
మున్ముందుకూడ మమ్మాదుకొానుమని వేడుము. 4

భీ ము డు

సంధి సానుకూలముగానిచో కౌరవ
నాథునికి నాప్రతినలు మరువ వ .
లదని గుర్తుంచు కొనుమని
బోధజేయుము రణము క్షేమముకాదని. 5

అ ర్జు ను డు

అల కర్ణుని బలమునమ్మి పోరు
దలపవలదని నుడువుము సుయోధనునకు
కలదు మాకుకూడ నీఅండ
కలనైన జయమువారికి జేకురదని తెలుపుము. 6

న కు లు డు

ఎందుకు కొరగాని వారమని భావించవ
లదని తేటతెల్లము జేయుము
సంధిగానిచో ఎనలేని నష్టమువాటిల్లు నని
బోధించుము ఆపైన వారియోగ మెటులుండునో! 7

స హ దే వు డు

నాకుతెలుసు మున్‌ముందు జరుగుసంఘటనలు
మాకు నీవుండ ఏమికొరత
మా కన్యాయముజరిపిన సహించమని నుడువుము
ఆ కౌరవనాథునకు తదుపరి చింతించినన్ ఫలితము
శూన్యము 8

ద్రౌ ప ది

మమ్ము త్రసురు పెట్ట ధర్మంబుకాదని
మామ ధృతరాష్ట్రునకు దెలుపుము
మమ్ము వేరుగ భావింపవలదనుము
నామాటగ నుడువుము ప్రతిన మరువవలదని. 9

శౌరి వల్లెయని పయనమాయె హస్తినా
పురికి సాత్యకునితో
మురారిరాక ముందెరిగి
రారాజుకు తగు స్వాగతమీయుమనియె తండ్రి. 10

ఉచితరీతిని నల్వురు
మెచ్చ ఘనస్వాగత మేర్పరిచి
విచ్చేయుమని వేడిరి
కుచేలుని బాల్యమిత్రుని సాదరముగ. 11

దేవదేవుని దర్శించి పురవాసులు ధన్య
జీవులమైతిమి నీ రాకవలన మా
జీవితము చరితార్థమాయె
దీవించవయ్యా నీకృప సదా కలుగునటులని వేడిరి. 21

విదురునింట జేసెబస ఆనాటికి
తదుపరి కొలువులో వివరించె
సంధిచేసుకొన యిరుపక్షములకు మేలని
బోధించె అంధనృపతికి సర్వవిధముల ఉచితరీతి. 13

పాండుసుతులు నీకు సదా విధేయులు
కడుదీనతతో ఐదూళ్ళిమ్మనిరి
నుడివె ఊళ్ళ పేర్లుకూడ మురారి
నిండుమనస్సుతో నెరవేర్పుము వారికోర్కె అనియె. 14

యిరుపక్షముల క్షేమమరసి పలు
మార్లు నుడువుచుంటి నీకండగానుం
దురు సదా నీమేలును మరు
వ రేనాటికిన్ కురునాథా మామా! 15



ఐదూళ్ళ పేర్లు వక్కాణించె శౌరి
యిందలిమర్మము గుర్తించుమని సూచించె
రాధేయుడు రారాజుకు
యీదూత నీపంచప్రాణములు కబళించు. 16



అంధరాజు తాను నామమాత్రుడనని సు
యోధనునికి నచ్చచెప్పి కార్యముసాధించిన
ముదమొందుదునని తెల్పె శౌరికి
గాంధారియు తనయునకు హితముజెప్పె. 17

తమ్ముని కొమరులంచు పాలీయ మన్నారు
యమ వాయు నాకాధిపత్యశ్వనీదేవతల పుత్రులు
తమ కేవిధముగ బంధుగులు తండ్రీ
తమ్ములెట్లైరని సూటిగప్రశ్నించె రారాజు. 18

మాకు నచ్చినరీతిగ యిచ్చెదము
మీకు కావలసినరీతిగ యీయము
మీకోరికమేర సమ్మతించమనెను సుయోధనుడు
శ్రీకృష్ణు డచ్చెరువొందె. 19

నిలువలేరు రణరంగమున పాండవులధాటికి
పలువురు ప్రముఖులు మీలోనున్నను
బలాబలములు పరీక్షించు సమయ మాసన్నమాయె
మేలుకోరి నుడువుచున్నాడ కడసారిగ ననియె మురారి. 20

కార్యము విఫలమాయెనని చింతించి
మారణ హోమము తప్పదనియె
మర్మముచే కృష్ణుని బంధింపజూసె
రారాజు దైవమును బంధింపతరమె ఏరికైనన్! 21

తనమహిమ తెలియజూప విశ్వరూప
మును ధరించె కురుదంపతులకుకూడ
కనులనిచ్చె అచ్చెరువొంది రందరున్
ముమ్ముందు జరుగు సంగ్రామము సూచించె. 22

వెడలివత్తు నని తెలియజేసి
కడుప్రేమతో కర్ణునికి పూర్వోత్తరము తెలిపి
పాండవసోదరులతో కలియు మనియె
విడనాడను సుయోధను నేనాటికిన్ అనియె రవిజుడు. 23

కార్యము విఫలమాయె నని
తిరుగుప్రయాణము గావించె
మురారి పాండవులకడకు ఏమి
వార్త దెచ్చునో యని ఎదురుచూచిరి. 24

తలచినరీతిని వాసుదేవుడు శూన్యహస్త
ముల నేతెంచుట తెలిసి పాండ
వులు తదుపరికార్యకలాప
ముల చర్చించిరి మురారితో. 25

సిద్ధముగందు పోరుసలుప కురు
నాథు దంగీకరించలేదు మీకోరిక
విధి ఎట్లున్నదో అట్లు జరుగును
విధాత వ్రాత తప్పునే ఏరికైన అనియె జనార్దనుడు. 26

మీరు కనికరించినన్ యమలోకపతి
కరుణించ దేమాత్రమున్
మారణహోమము తథ్యము మీ
మీ కర్తవ్య మొనరింపుడని హెచ్చరించె శౌరి. 27



# గీతాసార సంగ్రహం

యుద్ధరంగమున అర్జునుడు
పోరుసల్పుటకు సంశయుండాయె
ఆ స్థితినిగాంచిన మాధవుండు
బోదించె గీతను కనువిప్పుకాగ. 1

మమకారము పారద్రోలి
కర్తవ్య మొనరింపు మనియె
తనపై భారమువైచి
మానవ యత్నముకు లోటులేకుండ. 2

జీవులన్ని యొకటిగా భావింపు మనియె
ఎల్లజీవులందు తాను కలడనియె
సర్వము తాననియె యితరులు
నిమిత్త మాత్రు లనియె. 3

లోకములన్నియు తనకుక్షిని
కలవనియె తన్నునమ్మి
సంశయంబు పారద్రోలి
పోరు సాగించుమని ప్రోత్సహించె. 4

ప్రాముఖ్యతను బొందిన
పెక్కు తార్కాణముల దెల్పె
తుదకు దివ్యదృష్టి నొసగి
చూపె విశ్వరూపము జన్మసాఫల్యమొంద. 5

# కుంతి

ముని మంత్రమహిమచే
కనెను కుంతి నల్గురుసుతుల
కన్నెప్రాయమున కనెను కర్ణుని
కనెను తదుపరి మువ్వురుపుత్రుల. 1

కర్ణుని జన్మరహస్యము
మరుగుపరచె తుదివరకు
కురువంశ క్షయమునకు మూలముకాగ
మురారికూడ ధర్మజునకు తెలుపడాయె, 2

రమణుల చిత్త మెటులుండునో
కమలాసనుడు కూడ ఊహించలేడు
తమగుట్టు రట్టుకాకుండ దాచుకొనిరి
కోమలాంగు లెందరో,గుట్టు రట్టుకాకుండనే
ఏనాటికైనన్ . 3

పరమరహస్యమును గుట్టుగానుంచిన
పరమపాతికి కుంతి నిశ్చయముగ
కర్ణుని వరమొంది పంచపాండవులపేరు నిలుపుకొనియె
కర్ణునితల భారతమను నుడి ధరనిలిచె శాశ్వతముగ. 4

# కర్ణ

కోల్పోతివి తల్లిని పుట్టగానె
కోల్పోతివి గుర్తింపు జాతిలేక
కోల్పోతివి భ్రాతలను మిత్రునికై
కోల్పోతివి అసువుల శపథంబుజేసి. 1

అలనా డమరపతి విప్రరూపమున నీ
మూలధనమగు కవచకుండలముల నపహరింపజూడ
లీలగా నగుపడి నీ జనకుడు రవి వారించినన్
ఏలీల నీవు ప్రవర్తించితో లోకవిదితము కర్ణా! 2

నీహితముగోరి శౌరి ఎంత బోధించినన్
నీహితుడు రారాజున్ కాపాడ ప్రాణముల్
సహితము లెక్కచేయక నీవైరి శాత
వాహను నెదుర్కొని సమసితివి అంగరాజా! 3

కుంతిప్రాధేయతకు లొంగి అర్జునునితప్ప
యితరులజోలికి పోనని మాటయిచ్చి
నీతినుండి దిగజారక సమరము సల్పితివి కడు
చతురతతో లోకమంత అచ్చెరువొంద రవిజా! 4

కర్ణుడు భారతమునకు తలయని నీ
పేరు తలచుచుందురు యుగాంతముదాకా
శౌరిసహితము అచ్చెరువొందె నీతెగింపునకు
ఏరి నీకుసాటి యీరేడులోకాల సూర్యనందన! 5

నాతేరు నేలక్రుంగె తాళుమోయి నన్ను
సంగరనియమము పెడచెవినిపెట్టి
శౌరి ప్రోద్బలముచే శరమువీడి
నినుకూల్చిన పార్థుండు విజయుడుకా దేనాటికిన్. 6

నా అనుంగుసఖుం డీల్గె నాకింక యిలన్
జుర్రుకొననేదియున్ లేదని
విరక్తిజెంది మడుగుం జొచ్చె
కురుసార్వభౌము డేకాకియై. 7

కుంతి పుత్రభిక్ష వేడకున్నన్
సురలోకపతి కవచకుండలంబు లపహరింపకున్నన్
శల్యుండు సూటిపోటుమాట లాడకున్నన్
నాగాస్త్రము గురితప్పకుండినన్
భార్గవాస్త్రము స్ఫురించినన్
విప్రశాపంబు లేకుండినన్
ధరచక్రంబు కూలకున్నన్
శౌరి కిరీటి కండగా నుండి కపటంబు చేయకున్నన్
నిన్ను కూల్పతరంబే ఏరికైనన్ భానుజా. 8



# కర్ణ ప్రభావం

రని మిన్నుకెక్కినరీతి నీచరితంబు ప్రఖ్యాతజాషువా
కవీంద్రుడు ఖండకావ్యంబులందు సాకల్యంబుగా
వివరించి మహోన్నతస్థితికి దెచ్చె
కవితాలోకమందుకూడ ధన్యుడవోయి కర్ణా! 1

రారాజు నిన్నుజేసె అంగాధిపతిగ
వర్ణించె నిను జాషువా సాటిలేని భారతవీరునిగా
మురారికితెలుసు నీప్రతాపమహిమ
గుర్తించె నీ నిపుణతను గాంగేయుడు కూడ. 2

కుంతి విడనాడె నిను గంగలోన లోకనింద బాపుకొనగ
సూతపుత్రుడంచు మాటికి క్రుంగదీసిరి పలువురు
అతివినయముతో నపహరించె నాకపతి కవచకుండలముల
అతిదారుణ నాగాస్త్రము శల్యునివలన వ్యర్థంబాయె. 3

కోరిన తల్లికుంతికి మాటయిచ్చితివి
కిరీటిన్దప్ప యితరసోదరుల ముట్టనంటివి
కోరి భద్దినము కొనితెచ్చుకున్న రీతి
ఏరీతినైనన్ నీతి విడనాడనంటివి జాతిచెడినన్ కించపడక. 4

శాపకారణములే నీపతనమునకు మూలకారణంబులాయె
అపుడోయి సమరమునకూలిన తేరు చక్రమెత్తుదాకయన్న
కపటసూత్రధారి మొరాలకించడాయె
కపటంబుచే నినుగూల్చిరి వేరుదారిలేక. 5

పరశురాముని సేవజేసి ఘనకీర్తి నొందినావు
శరీరము గగుర్ పాటుచెందు నీ
చరితము పరిశీలింపగా నిష్పక్షపాతు
లేరికైనన్ నీకు సాటిరారు అంగరాజా! 6

కౌరవేశ్వరునకు చేసితివి ప్రతిజ్ఞ తుదిప్రాణ మున్నంతదాక
పోరుసలుపుదునని తెగించితివి
శౌరి నీవైరికండగనుండినన్ లేరు నీవంటి
శూరులు వీరలోకమందు రవిజా! 7

— —

## కర్ణ శపథం

అలనా డస్త్రప్రదర్శన కూటమిలో
కులములేమిచే అర్హతగోల్పోతిని
కోల్పోయిన అవకాశము నీదయా
శీలతతో నన్నంగరాజుగ చేసి నిలిపితివి. 1

చేసితిని బాస నన్నంగరాజుగ
చేసిననాడు నీకండగా నుందునని
చేసెదను నీసేవ తుదిశ్వాసవరకు నీ
కే సంశయంబు వలదు నమ్ము నామాట రాజరాజా! 2

3]

నాటినుండి ఏకమై కలసిమెలసి ఒక
బాటలో పయనించుచుంటిమి
జంటగా సంచరించితిమి ఏ
నాటికిన్ వీడనిబంధ మేర్పడె. 3

నిజసోదరునికన్న మిన్నగ జూచుచుంటివి
నీజతగనుండి పలుసేవ లొనరించితిని
నిజబాంధవ్యము మనచెలిమికి మిన్న
నా జన్మఫలించె మరువగలనె నీ ఉదారత! 4

వీడను నీచెలిమి ఏనాటికిన్, కా
పాడెద నిన్ను కంటికిరెప్పవోలె
కడకు ప్రాణమైనన్ ఒడ్డెదను
నిండుమనముతో బల్కుచున్నాను సార్వభౌమా! 5

పోరెదను సంగ్రామమున తుదిప్రాణ మున్నంతదాక
లేరు నీవంటి ఉదారులు
కురునేతా! నిలుచు
ధరలో మన మైత్రి చక్కనిగా. 6

ఆయువుపట్టు నెరింగించి పోరు
మానుటకు పక్షపాతి గాంగేయుడను కాను
యుద్ధవిరమణ చేయ సూత్రము
దెల్పిన ద్రోహి ద్రోణుండను గాను. 7

చేసినబాసకు విరుద్ధముగా
నడువ మాయావి మురారినిగాను
త్రినేత్రు డడ్డుపడినన్ అర్జును
నంత మొందించుట తథ్యము. 8

నాతనువు పోయినన్ చింతించను
తిరుగులేదు నా శపథంబునకు
మిన్ను కూలినన్ లేశంబైన సంశయంబు
వలదు మిత్రమా సుయోధన సార్వభౌమా! 9

—/—

## కృష్ణుడు కర్ణునితో

మునివరముచే కుంతి నిను
కన్నది రవివలన కన్నెప్రాయ
మున సాకి పెద్దజేసె రాధ నిన్ను
గాన నిక్కముగ కౌంతేయుడవు భానుజా. 1

ఆమోదించెదరు నిన్నందరు సర్వ
సమ్మతముగ అగ్రజడువుగాన
నమ్ము నామాట జరుగు నీకు మో
దమలర పట్టాభిషేకంబు నల్గురుమెచ్చ రవిజా! 2

## కర్ణుడు శ్రీకృష్ణునితో

పెరిగితిని సూతకులమందు
కంటిని సుతుల సూతకులాంగన యందు
అవసరమని యిపుడు జాతిమార్చుకొన
నంగీకరించుట సమంజసమె! 1

లోకు లెకసెక్కెములు చేయరే
తగునే నీకు నన్నీపగిది కోర.
ఏది ఏమైనన్ యీకర్ణుడు మారడని నీవెరుగవా
లేదురాజ్యకాంక్ష మోహములేదు పరకాంతలందు.
ధ్యేయమొకటె రారాజు సేవచేసి
ఋణముదీర్ప మాధవా! 2

...o...

## కర్ణుడు కుంతితో

జాతి లేకపోయె నీమూలమున
నీతి విడనాడజాల ఏది ఏమైనన్
అతిరథు నింట పెరిగి అతిగారాబముగ
కౌంతేయుడను కాను రాధేయుడ నేనాటికిన్.

## కర్ణుడు శల్యునితో

తేరు సూచించినరీతి తోలి నీ
కర్తవ్య మొనరించుము చాలించి వ
దరుబోతుమాటల మద్రరాజా
కర్ణునికి శరముల గురినేర్ప మేటి మొనగాడవే? 1

సూటిపోటి మాటలచే నాఉల్లము
కట్టుదప్పనే అల సుయోధనుని
మాటమేరకు నియమముదప్పక వూర
కొంటిని నాఅరచేతిని నీవగ్నికణమై కాల్చుచున్నన్. 2

అలపాండవ పక్షపాతివి నీవని
తెలిసియుండియున్ నిన్నాశ్రయించె రారాజు
తెలియవచ్చె నీనాడు నీ కపటము
చాలించు నీ భేదభావంబు శల్యా! యింకనైనన్. 3

...o...

## కర్ణార్జునుల పోరు

కరి కరి ఢీకొనినరీతి దోచె
కర్ణార్జునులపోరు దిలకింప
సురలు గుమిగూడిరి నింగిని
వర్ణింపతరమె వాణికైనన్. 1

కర్ణ ప్రతాపము జూచి అచ్చెరువొందె
మురారి సైతము తగినరీతి నెదుర్కొన
తరుణోపాయ మూహించె దిన
కరుడు గతిమందగించి తన కొమరునిగతి దలపసాగె. 2

జయము దైవాధీనమంచు మురారికి నుడివె రాధేయుడు
నియమము పాటించి రణం బొనరింపుమ
నియె పాండుతనూజమధ్యమునితో
జయము చేకురె కిరీటికి శౌరి అండవలన. 3

కర్ణ నిర్యాణమున కందరు ఖేదమొం
దిరి పాండువులుదక్క కుంతికూడ
మొరపెట్టె, కురుకులము కుంటుబోయెనని
రారాజు శోకించె,. భాస్కరు డంతరించె స్నానమాడ. 4



## కర్ణ పరితాపం

అకటా! కాలము దాపురించినటుల దోచు
కన్నతల్లి లోకనిందకు వెరచి గంగపాల్జేసె
తండ్రి వారించినన్ కవచకుండలము లింద్రున కర్పించితిని
నమ్మిన శల్యుండు ప్రత్యక్షశత్రువై సంచరించె. 1

నాగాస్త్రము నిష్ఫలంబాయె
గురుశాపంబుచే భార్గవాస్త్రము స్ఫురించ రాదాయె
అలనా డింద్రు డొసగిన వైజయంతాస్త్రము
చెల్లె ఘటోత్కచునిపై. 2

విప్రశాపంబుచే రథచక్రం బిలన్ కూలె
నిండుసభలో నన్నంగరాజుని జేసి
కాపాడె ప్రతిష్ఠను రారాజు ఏలితి
ధరావలయమంత సుయోధనుని పేరున. 3

ఎనలేని దానములచే పేరు వన్నె కెక్కె
విప్రుల యీర్ష్య నను క్రుంగదీసె
చేసితి మానవయత్నము జయమొంద
విధికృతము తప్పించుకొన సాధ్యమౌనె ఏరికైనన్
కౌరవనాథుని ఋణము కొంత దీర్చుకొంటి
గాని దిక్కులేని నన్ను చేరదీసి పెంచిన రాధమ్మ
ఋణము తీర్చుకొనలేకపోతి లేశ మంతైనన్
లేరు లోకమం దాప్తులు కురునాథుడు దక్క
వాంఛలేవియు లేవు నిశ్చితముగా కనుదోయి మూతు. 4



# సుయోధనుని పరితాపం

ఎనలేని దానములుచేసి పేరొందిన పుణ్యమూర్తి
వైరుల కేనాడు వెన్నుజూపని ధీరుండు
రాజులలోన మేటి సామంతరాజు
హితబోధలం దాతనికి మంత్రులందరు తీసికట్టు
నీతిపాటించ శౌరిబోధలు పెడచెవినిపెట్టిన వివేకి
ననుతోడు నీడవలె వెంటాడి తిరుగుచూఁ మెలగిన ప్రియ
సఖుండు
ఏకాకియై ఏమియు తోచక గుండెపగిలె రారాజునకు.

...0...

# ఓదార్పు

కన్నది నిను కుంతి రవివలన
కన్నెప్రాయమున ముని దుర్వా
సుని మంత్రమహిమచే సాకెను
నిను రాధ ఏనాటి ఋణానుబంధమో! 1

నేర్చితివి సకలవిద్యల నిపుణతతో
పరశురాముని సేవించి బడసితివి
భార్గవాస్త్రముకూడ ఏవియున్ ఉప
కరించలేదు శాపము వశమున. 2

ఎనలేని దానముల జేసితివి
దాన మిచ్చితివి కవచకుండలముల
దాన మిచ్చితివి నీ ప్రాణముకూడ
దానకర్ణుడన్న నామము నిల్చె ధరలో శాశ్వతముగ. 3

భ్రాతృత్వమును చంపుకొంటివి
మిత్రత్వము మిన్నయని నిరూపించి
శత్రుత్వము పెంచుకొంటివి కుంతీ
మాత కోరికనెరవేర్చితివి నీ ప్రాణములనొడ్డి. 4

శాపకారణములె కాక
నీ ప్రాణములదీయు శల్యుని
కపటము మురారి మాయ నా
కపతి పుత్రాభిమానము, నీ అంతముజూనె. 5

కోరివైరము పెంచుకొంటివి
రారాజు కోర్కెదీర్చ శపథంబు జేసితివి
కిరీటి నంతమొందించెద నని
కారణ మేమొ మీశత్రుత్వమునకు! 6

జయము చేకూరలేదని కుందకుము మాన
వయత్నము చేసితివి తుది ప్రాణమున్నంతదాక
సుయోధనుడు నీత్యాగము మరువడు
జయాపజయములు దైవాధీనములె కదా! 7

నీకంట నీరొత్త లోకులందరు
ఏకమై నీచెంత చేరిరి నింగిని
నాకలోకవాసులు గుమిగూడిరి నీతెగు
వ కబ్బురమందె వీరలోకమంత. 8

సరిలేరు నీ కేలోకమందు
ధరలో నిలిచె నీపేరు యుగాం
తములైన అదియె చాలు నీ కే
కొరతలేదు కడుధన్యుడవోయి కర్ణా! 9

కర్ణునితల భారతమని నేటికిన్
మారు మ్రోగుచున్నది లోకమంత
చిరస్థాయిగ నిలుచు నీపేరు
కీర్తి యశము నింగినేల ఏకమైనరీతి. 10

నీ వేమాత్రమున్ చింతించ
నవసరములేదు కొ
దవలేదు జయము లేకున్నన్
భువినిండె నీవెలు గాచంద్రార్కముగ కర్ణా! 11



# దేవతా స్తుతి

## విష్ణు దండకం

వైకుంఠవాసా శ్రీలక్ష్మీహృదయనివాసా

సదాభక్తులన్ బ్రోతువు పాపులన్, దోషులన్ శిక్షింతువు.

నీకృపాసాగరమున కంతుగలదే

నీ దయావీక్షణముల్ లేకున్న లోకాలు నిలువగలవే

అంతటన్ అన్నివేళలన్ ఉండెదవు నీవులేని చోటుకలదే

అన్నిరూపములు నీవే అందరంతరాత్మవు నీవే

దాల్చితివి దశావతారముల్ ధర్మసంస్థాపనార్థమై

కదలదు గడ్డిపోచసహితము నీసంకల్పము లేనిదే

నవగ్రహరూపుడవీవే సప్తఋషులు నీ ప్రతిరూపముల్

నిరాకారరూపా నింగియున్ నేలయున్ నిండియుంటివి

సర్వాంతర్యామి సకలజీవులన్ సృష్టించి పోషించి అంత మొందించెదవు

విశ్వరూపా అనేకవేషముల్ వేసితివి, గదా చక్రధారీ

పలురకాల ఆయుధముల ధరించెదవు బ్రహ్మాదిదేవతల్ నీమహిమ

తెలియజాలరు నీశక్తి నూహింప నిన్ను స్తుతింప నాబోటి వ్యక్తికేం తరమే

శివ శివ యనుచు శివనాదము చేయుము
శివనామము జపించువారికి
శివసాన్నిధ్యము సులభమగు
అవలీలగా ప్రసన్నుడగు నిక్కము నమ్మండీ. 2

—

## శ్రీ లక్ష్మి

కలుగు సర్వసంపదల్ నీ వున్నచోట
పలుమాటలేల నినునమ్మి కొల్చినవారికి
యిలన్ భోగభాగ్యములకు లోటులేదు
పాలసముద్రునిపట్టీ శ్రీమహాలక్ష్మి!

—

## సరస్వతి

విరించిరాణివి చదువులదేవి!
అరమరలేక నిను అర్థించుచున్నాము
కరుణజూపుము మాపై చల్లగా
వేరుదైవము లేదు జ్ఞానోదయము నీయ జననీ!

## పార్వతి

గిరిరాజ సుతవై జనించినావు
అర్ధనారీశ్వరివై రాణించినావు
కరిశిరము గలవాని తల్లి వైనావు
లేరు నీకుసాటి జగజ్జననీ! కాత్యాయినీ! 1

అభయము నొసగి జననీ
శుభముల నొసగుము సదా
మాధారము నీదే నమ్మా
అభము శుభము తెలియదు మాకు. 2

—

## గంగ

గిరులలో పుట్టి గలగల పారుచు
నరుల పాపముల బాపుచు
కర్షకుల పాలిట కల్పవల్లివై తుద కంబోనిధిన్
జేరెదవు పావనీ! గంగాభవానీ!

—

## నారదుడు

తిరుగుదువు సదా లోకసంచారివై
దూరుదురు నిన్నందరు కలహ
కారకు డటంచు నీభాగ్య మదియేమోగాని
ఎరుగరు నీచేతలు లోకకళ్యాణం బనుచున్.

—

## విష్ణుమూర్తి నారదునితో

వచ్చెదవు సదా మదీయ నామస్మరణ చేయుచు
తెచ్చెదవు ఏదో లోకవార్త
మెచ్చెదరు కొందరు నిను
చిచ్చు పెట్టెదవని దూరుదురు మరికొందరు నారదా!

—

## శ్రీ భావనారాయణ

సర్వవరమున వెలసిన దేవా! శ్రీ భావ
నారాయణా బ్రోవుము దీనుల
కరములెత్తి మ్రొక్కుచున్నాము
చేరితి నీపాదముల చెంతకు దీనావనా!

—

## మారుతి

ఆంజనీసుతా! ఆంజనేయా!
రవి గురువై నీకు నిగమములు బోధించె
సుగ్రీవుని నమ్మినబంటుగా కొలిచితివి
శ్రీరాముని దూతవై జలధిదాటితివి
సీతాన్వేషణకు ఎనలేని దోహదము చేసితివి
రాముని కామె జాడ తెలిపి ధన్యుడ వైతివి
ఘనలంకా సంగ్రామమందు తోడ్పడితివి
సంజీవిని తెచ్చి లక్ష్మణుని ప్రాణదాత వైతివి
అస్ఖలిత బ్రహ్మచారి! భావిబ్రహ్మ నీవు

నీనామము దలచిన జయము చేకూరు నిశ్చయముగ
భూతపిశాచములు దరిరావు వాయునందనా
మహాబలా! దీర్ఘకాయా! ద్వాదశనామా!
శ్రీరాముని దూతవై వెలసినావు
శ్రీరాముని బంటువై కొలిచినావు
మారుతియని నామ మొందినావు నీ
స్మరణమే మాకు శ్రీరామరక్ష.

—

## ఆ ది త్య

లోకబాంధవా! నీవు
లేక లోకములు నిలువలేవు
నీకు నీవేసాటి నవగ్రహములందు ది
నకరా! మము సదా కాపాడుమా!

—

## వి శ్వ రూ ప ం

ఆదిమధ్యాంతములేని అనంతరూపా
మది నిన్నే తలతుము దివ్యమూర్తి
నీదయలేనిదె మన లేదేదియున్ వేద
వేదాంతవేద్యా మము బ్రోవుము విశ్వరూపా! 1

ఆదిమధ్యాంతరహితా, వే
డెదము నిన్ను సదా నిరాకార
ఆదుకోవయా మము దేవాధిదేవా!
నీదయ ప్రసరింపుము నిరంతరము విశ్వరూపా! 2

—o—

## శ్రీ రాముడు

నీబంటు నేనయ్యా కాపాడుమా!
అభయమీయవయా సాకేతరామా!
అభినందించెద నిను జీవ మున్నంతదాక
ఏభయములేదు నీ అండ వున్నంతదాకా. 1

పాలింప రావా రామా మా
పాలిదైవము నీవేనయా, పా
పాలను తొలగించు దయామయా, మా
యిలవేల్పు నీవేనయా దశరథరామా! 2

రాముడు సుగుణాభిరాముడు
రాముడు సకల గుణాభిరాముడు
రమణీయ సౌందర్యమూర్తి
కమనీయ చరితాత్మకుడు. 3

ఇనవంశంబున పుట్టినావు
జనకుని తనయను చేపట్టినావు
దునిమితివి రావణాదుల
ఘనరీతి నయోధ్యను పాలించినావు. 4

—0—

# శ్రీ భావనారాయణ

భావనారాయణ భక్తజనము నిన్ను
భక్తి మీరగ కొలిచె ఆపదలు తొలగంగ
ఆర్తితో నినువేడి వాంఛితార్థము బడసి
వెనువెంటనే నిన్ను మరచిపోదురుగాదె. 1

స్వార్థమే పరమార్థమని మదిని భావించి
అర్థకామముకొఱకు అకృత్యములు చేసి
పాపభీతిని విడిచి పరహింసచేయు జన
సముదాయముల నీవు సంహరింప రావె
ఆపదోద్ధారక భావనారాయణా! 2

సిరిసంపదలలోన సుఖశాంతు లవిసున్న
అన్నసత్యం బెరిగి భావనారాయణుని
భావమందున సతము భావించువారికే
ఇహపరంబునఁకూడ సుఖశాంతి లభియించు. 3

మానవాకృతులలోన కనుపించు మానవులు
దానవులుగా మారి నిర్దయత్వముతోడ
హంసలసరస్సులో నీదులాడచు సతము
సంఘశాంతిని వారు భంగపరచుచుండ్రి.
అట్టివారిని పట్టి అణగద్రొక్కగ వేగ
బయలుదేరుము నీవు భావనారాయణా! 4

కాకినాడకు మిగులదవ్వులో నున్నట్టి
సర్పవరగ్రామాన ద్వాపరాంతమునందు
వెలసినావని తెలిసి పరాశరాఖ్యుండు
నీదర్శనముచేయ వెడలి వచ్చెనుగాదె!
భావనారాయణా! మా నుతుల నందుకో,
(నాభావన లాధారముగ
బ్రహ్మశ్రీ శ్రీపాద శ్రీరామమూర్తి
గారు దయతో కూర్చినది).

## విష్ణు మహిమ

ఏమహిమచే పిండము లుద్భవించు
ఏమహిమచే రవి చంద్రులు విధు లొనర్తురు
ఏమహిమచే సాగరములు హద్దులో నుండు
ఏమహిమచే సర్వజీవులు మనుచుండు
ఏమహిమచే జలభక్ష్యములు సదా లభించు
ఏమహిమచే కాలుండు జీవుల గొనిపోవు
ఆమహిమ కొనియాడ తరమే ఏరికైనన్.

---

## వినతి

శ్రీరాముని కృపచే బ
మ్మెరపోతన లాంధ్రీ
కరించె భాగవతము నేనును
శ్రీరామునిపై భారముంచి వ్రాయబూనితిన్

# శ్రీ హరి

అవనిభారముదీర్ప పెక్కుమార్లు
అవతరించిన ఆదిమూర్తి అందు
కోవయ్య మా నమస్సు లివిగో
బ్రోవ భారంబు నీదే దేవాధి దేవా! 1

గతి నీవే మాకు గరుడవాహన లోక
పతి నీవు పరంధామా వేడుచున్నాము
అతి వినయముగా అగుపించ రావయ్య
అంతా నీవేనయా లోక బాంధవా! 2

నీలీల నుద్భవించు సమస్తము
నీలీల పెరగదె సర్వము
నీలీల సాగు నన్ని కార్యముల్
నీలీల అంతమొందు తుద కంతయున్.

చరితార్థుడాయె విష్ణుని నమ్మి ధృవుడు
హరిపై భారము మోపి కృతార్థుడాయె ప్ర
కరిరాజు జన్మసఫలతనొందె భారంబుపై
శౌరి కరుణ భాగ్యోన్నతిన్ బొందె కా

హరినామ కీర్తనల్ వినని చెవులు చెవులే
హరిని చూడని కనులు కనులే
హరిని నుతింపని నోరు నోరే
హరిని దలంపని జన్మ జన్మయౌనె. 5

స్తుతింతు నీనామము సదా
అతి భక్తిశ్రద్ధలతో నీవే
గతియంచు వినుతింతు నిత్యము మా
కాత్మయుడవు నీవే నిక్కంబుగా. 6

భక్తి మెండారకొల్చి నీకృపను బొంద
భక్త ప్రహ్లాదు డనుగాను బాల్యమందె నీదయను బొంద
భక్త మార్కండేయు డనుగాను దీక్షతో నినుకొలువ
భక్త ధృవుడను గాను నిశ్చలభక్తితో నిను వేడ. 7

బ్రోచితివి నిను నమ్మినవారి నెందరినో
కాచితివి కరిరాజుని మకరిని చంపి
వేచియున్నాడ నీముంగిట దర్శనం
బిచ్చి మోక్ష మీయుము పరంధామా!

ఆదిమధ్యాంతముల్లేని అనంతమూర్తి
ఆదుకోవయ్య మమ్మాదరముతో
కదలదు నీసంకల్పము లేనిదే గడ్డిపోచయున్
వేదవేదాంతవేద్యా! విమలమూర్తి!

నిరాకారమూర్తి నిన్నే [illegible]
కరుణజూప రావా కారుణ్యమూర్తీ!
కరిని కాపాడినకీర్తి మహాత్మ్యకోవిదా!
కోరికలు నశించు నీచరణముల [illegible].

కలవందురు ఎల్లద
కల్ల కాదది నిక్కముగా
వలచితిని నిను మనసార
కొలిచెద నిన్ను జీవ మున్నంతవరకు. 11

సంశయంబులేదు లేశమైన
ఈశ! జగదీశ! దీనులపాలిట
కల్పతరువై వెలసినదేవా!
విశ్వమంత నీవే నిండియున్నావు. 12

దుష్టుల శిక్షింప
శిష్టుల రక్షింప
అష్టకష్టముల కోర్చితివి నీప్రతి
ష్ఠ నిలుచు చిరస్థాయిగ. 13

కరుణించరావా కరుణాకరా!
దీనులబ్రోచిన దేవాధిదేవా!
కరియార్తి బాపిన దీనావనా!
ప్రహ్లాదుని కాపాడిన గరుడ వాహనా!

ధ్రువుని దయజూచిన వైకుంఠవాసా!
గుహుని దీవించిన దశరథరామా!
శబరికి మోక్షమిడిన సీతామనోహరా!
గోపరాజుని కరుణించిన యినకుల తిలకా! 15

త్యాగయ్యకు ముక్తి నొసగిన జానకిరమణా!
పోతనను కటాక్షించిన జగదభిరామా!
అహల్యా శాపవిమోచకా! కోదండరామా!
దశకంఠు నంత మొందించిన దశరథరామా! 16

కరుణ జూపుము లోపము లెన్నివున్న
కరిరాజవరద కృపాలవాల
మరణము దాపురించునెపుడో తెలియరాదు
నిరాదరణచేసి నన్ను మరువకయ్యా! 17

ముక్తి సాధించి రెందరో లెక్కలేదు
భక్తి నింపార నిను వేడుచుంటి
శక్తి వున్నంతవరకు నిను మరువనయ్య
మాకెపుడు నండదండగా నుండవయ్యా దేవదేవా! 18

దానధర్మములు జేయ ధనములేదు
కానల కరిగి కొలిచెదమన్న శక్తిలేదు
కనుల కింపార నిను జూతుమన్న కానరావు
కనికరించి కావుమయా కరుణాలవాలా! 19

సత్యము నీవె నిత్యము నీవె
అనునిత్యము నిన్నే కొలిచెదమయా ఆ
కృత్యములు చేయకుండ కాపాడవయా
నీతలపే మాకు ప్రసాదించవయా. 20

తలచెదము నిన్ను సదా దేవాధిదేవా!
కొలిచెదము ని న్ననునిత్యము కరుణాంతరంగా
యిల వెలిసితివి పలుచోట్ల కమలనాథ!
యిలవేల్పు వైతివి భక్తుల నాదుకొనగ వైకుంఠవాసా! 21

నీచెంత సదా నుండనోచుకొనిన సౌమిత్రిని గాను
నీచరిత రచించి ఘనకీర్తి నొంద వాల్మీకిని గాను
నీగోపురము కట్టించి పేరొంద గోపన్నను గాను.
నీపై కీర్తనలు రచించి ముక్తినొందిన త్యాగయ్యనుగాను.

నిను నదిదాటించి ముక్తినొంద గుహుడను గాను
నీపాదతాకిడికి పూర్వ రూపొందిన అహల్యను గాను
నీచెలిమినొంద సుగ్రీవ విభీషణాదులను కాను
నీపాదసేవ లభ్యమగుటకు మారుతినిగాను 23

నీకుతాటిపండు నైవేద్యమర్పింప ధన్యురాలు
దమ్మక్కను గాను
నీకు పండ్లనర్పించి మోక్షమొందిన భక్తురాలు శబరిని గాను
నీపై కీర్తనలరచింప యోగి త్యాగయ్యను గాను
నీ సంగరమున పాల్గొనిన కపివరుడను కాను

నీ శరములచే అంతమొంద వాలి దశకంఠులవలె
యోగంబు లేదు
నీపాద సంస్మరణ నాకాంక్షించు దాసుడను బ్రోవుమా
శ్రీరామాచంద్రా 24

కల డందురు దీనులయెడ
కలడనుట కల్ల పాపులయందు
కలడు నిశ్చయముగ పుణ్యులందు
కలడో లేడో అనువా రవివేకులుకారే. 25

కన నోచనైతిని కనులకింపుగ
వినలేకపోతిని నీమాటలు వీనులవిందుగ
ఎనలేని దురితముల చేసితినేమో యి
కనైన దయజూపుము కరుణాసాగరా! 26

—o—

## మురారి

దోచితివి గొల్లల మనసుల
దాచితివి భామల కోకలు
బ్రోచితివి భక్తు లందరిని
కుచేలవరదా! కృపానిధీ!

—

# శ్రీ రామచంద్రుడు

రామనామము జపించెద
రామునిదక్క నమ్మ వేరుదొరల
రాముడు దురితముల బాపు
రాముడే రక్షకుడు సర్వజగతికిన్. 1

దిక్కులేదు మాకు, నీవు
దక్క రామా అన్ని విధముల
మాకండగ నుండుము దేవా!
ఏకాగ్రతతో కొలిచినవారికి రక్షనీవే రామా! 2

పరమేశ్వరుని మెప్పించి ఆత్మలింగమును
కోరి బొందదే లంకాపురినేత
శ్రీరాముని ప్రసన్ను జేసికొని
శరణు బొందదే విభీషణుండు. 3

శరణు శరణంచు సదానిను వేడుదుమయ్యా
కరుణించి కాపాడు భారంబు నీదే
వేరుదైవముల దలపనేల నీవు మా అండనుండ
శ్రీరామచంద్రా! కరుణాసాగరా! 4

శ్రీరాముని కొలిచినవారికి
దురితము లంటవు నమ్మండీ చే
కురు సుఖములు సంశయించకండీ
శ్రీరాముడె సర్వము సదా దలచండీ. 5

ఇనకులతిలకా! శ్రీరామచంద్రా
కనపడరావా కరుణాలవాలా
మనసార నిన్నే దలచెదము సదా
జానకీవల్లభ! జయ జయ రామా! 9

## కైకేయి

వరముల రెండు బడసి కైకేయి
శ్రీరాముని కానలకంపె
దూరుదు రామెనందరు అటుకాకున్న అవ
తారలక్ష్యము కొనసాగునే.

## గోపాలుడు

నల్లనివాడు తమ్మికనులవాడు
గొల్లకాంతల మనసుల
నెల్ల దోచికొన్నవాడు మాటలు
పలుసార్లుచెప్పనేల జగతికి మోహనాకారు డతడు. 1

యదు వంశమున జనించి
నీదు చాతుర్యము జూపి కంసాదులను దునిమి
జూదమటుల నడపి నావు సంగ్రామము
వెదకి జూచిన లేరు నీవంటి సూత్రధారులు గోపాలా! 2

భారతకథకు చుక్కాని వీవు
గోవర్ధనగిరినెత్తి గోకులవాసుల కాపాడితివి
కుచేలున్ కుబేరున్ జేసితివి
కంసాదుల నంత మొందించితివి. 3

గీతను బోధించితివి గాని
నీ గీతను మార్చుకొన లేకపోతివి
తుదకు బోయని కోల కీల్గితివి
పామరుడైనన్ పరమాత్ముడైనన్
ప్రారబ్ధ కర్మము ననుభవించుట
తప్పించు కొనలేరన్న నుడి నిజమాయె. 4

—

## శ్రీ వెంకటేశ్వరస్వామి

సప్తగిరి నివాస శ్రీనివాసా
ఆపదల నుండి రక్షింప రావా
గంపెడాశ నీపైన కలదు మాకు
పాపముల బాపుమయ! దేవా!

ఏడుకొండలవాడ వేంకటేశ!
లేడు నీవంటి దైవము వెదకిజూడ బంగారు
కొండపై వెలసిన దేవా! మా
అండ నీవుండ మాకేమి కొదవ.

## హరి కృపాపాత్రులు

మొరలిడి విముక్తి చెందె కరిరాజు హరికృపచే
హరిపాదమును శిరమున నిడుకొని ధన్యుడాయె బలి
హరినినమ్మి ప్రసన్నుచేసుకొనె ప్రహ్లాదుడు
హరినిగొలిచి చరితార్థుడాయె ధ్రువుడు.

—

## ప్రహ్లాదుడు తండ్రితో

హరిని స్మరించి తన్మయ మొందెదను నేను
హరిని ద్వేషించి అశాంతి నొందెదవు నీవు
మార్గములు వేరు తలపు లొకటే
హరిదక్క నీకు నాకును గతిలేదు గుర్తించుకొనుము
జనకా.

—

## హరిస్మరణ

సకలదేవతలు నీరూపమని వేడెద
నా కేకోర్కెలు లేవు నిశ్చయముగ
నిక్కముగ సదా దలతు హరిచరణముల
ఏకాగ్రతతో చిత్తము నరికట్టులేకున్నన్.

—

## సు తు లు

సుతుల నల్వురుండియు దశరథు డేకాకియాయె
సుతుల నూర్గురను కని అధోగతిపాలాయె ధృతరాష్ట్రుడు
సుతరత్నము వాసుదేవుని కనినన్ ఫలితము శూన్యమాయె
వసుదేవునకు
సుతులు లేరని గుండిన ఫలమేమి

---

## ఉక్కుమనిషి (పటేలు)

తన దృఢసంకల్పముతో
ఎనలేని రీతి దేశవ్యవహారముల
కొనసాగించె మితిమీరిన స్వతంత్ర సం
స్థానముల విలీనముచేసి భళీ అనిపించు కొనియె.

---

## పొట్టి ప్రధాని (లాల్ బహదూర్)

కొనరామెందు నీవంటి సాహ
సిని నైతికవిలువలకు ప్రాధాన్యత నిచ్చితివి
కని వినని రీతి ఢీకొంటివి సమరమును
ఎనలేనిరీతి నేలితివి కడునిపుణతతో శాస్త్రీజీ.

---

## అమరజీవి (పొట్టి శ్రీరాములు)

వింటిమి పలువురు దాతల పేర్లు
కంటిమే ఏనాడైన జీవితమును తృణ
ప్రాయముగ నొడ్డి సాఫల్యతచెందె
ఆంధ్ర రాష్ట్రావతరణకై నిలిచితివి అమర జీవివై.

# భక్తి భావాలు

భక్తప్రహ్లాదుడనుకాను బాల్యమందె నీదయను బడయ
భక్తమార్కండేయుడనుగాను దీక్షతో నినుకొలువ
భక్తధ్రువుడనుగాను నిశ్చలభక్తితో నీకృపనుబొంద
శక్తికొలది నామననమున ధ్యానింతు బ్రోవుము దేవా! 1

వలదు భోగ భాగ్యములు
వలదు సిరి సంపదలు
వలదు పాడి పంటలు
చాలు నీకృపయున్న దేవాధిదేవ ! 2

నారదాదినుత నారాయణా
నరులను మము బ్రోవరావా
గరుడవాహనా గతినీవె మాకు
కరుణాసాగరా కాపాడరావా ! 3

నాట్యమాడవా నాగేంద్రహార
ఆదుకోవయా ఆపదోద్ధార
కాపాడరావా కైలాసవాసా
దీవించవయా దీనదయాళో. 4

నిధి ఏల దేవునిసన్నిధి నుండగా
వెదచెందకు దేవదేవుని నమ్మికొని
కొదువ యుండదు దైవకృప యున్న
సదా ధ్యానించుము దేవుని చరణముల. 5

దానవసంహార దశావతార పురుషా
దశముఖమర్దన దాశరిథీ
కుచేలు బ్రోచిన కృష్ణావతారా
కరిరాజుని కాపాడిన కృపానిధి 6

ప్రహ్లాద ధృవ బాలభక్తుల నాదు కొంటివి
దీనులపాలిట కల్పతరువువు
ఆర్తుల మొరాలించి కాపాడిన దేవా
నీ మహిమ పొగడ నాతరమే? 7

దేవాధిదేవా నారదసన్నుత శ్రీహరీ!
సదా నీచరణములపై
మాదృష్టి నిలుచునటుల
వరమీయవయ్యా వరదా! 8

దీనబాంధవా వైకుంఠవాసా
దైవములందు దేవదేవుడవు
నిరూపించితివి నీమహిమల
నిను పొగడతరమె పెరికైనన్. 9

మాదురితముల మన్నించి
కాపాడుభారము నీదేనయా
లేరు మాపాలిట నీవుదక్క
యీ భవసాగరమును దాటింపుము. 8

క్షీరసాగరశయనా శ్రీలక్ష్మీహృదయలోల
నీకటాక్షవీక్షణములే మాకు సదా అండ
లేవు కోర్కెలు నిక్కంబుగా నీరజాక్ష
నమస్తే నమస్తే నమస్తే నమహః. 9

—o—

## భక్తి స్తోత్రం

అయోధ్యవాసీ రామ నమో !
రేపల్లెవాసీ కృష్ణ నమో !
రఘుకులతిలక రామ నమో
యదుకులభూషణ కృష్ణ నమో
దరథశనందన రామ నమో
వసుదేవసుతా కృష్ణ నమో
తాటకిమర్ధన రామ నమో
పూతనసంహార కృష్ణ నమో
అహల్య శాపవిమోచన రామ నమో
కుబ్జ శాపవిమోచస కృష్ణ నమో
మారుతిసేవిత రామ నమో
కుచేలసేవిత కృష్ణ నమో
రావణమర్దన రామ నమో
కంసాదిహార కృష్ణ నమో
సీతావల్లభ రామ నమో
రాధాప్రియా కృష్ణ నమో

## ధృతరాష్ట్రుడు దుర్యోధనునితో

ఆదిమధ్యాంతమెరుగని పరబ్రహ్మమూర్తి
సృష్టి స్థితి లయకారకుండు
భువి దివి నిండిన సర్వాంతర్యామి
అత డసమానుడు జగన్నాటక సూత్రధారి. 1

అందరి మేలుకోరి విచ్చేసె మాధవుండు
సాకల్యముగ చర్చించి సంధి
పొసగింపు మెల్లరు క్షేమముండ
సుయోధనా! పట్టువిడచి. 2

—

## ధృతరాష్ట్రుడు శ్రీకృష్ణునితో

అంధుడనౌట ఏలె నానాడు పాండు
వృద్ధుడనౌట ఏలుచున్నారు నాతనయు లీనాడు
మూర్ఖులౌట హితవు వినరని వేరె నుడువనేల
మాధవా! పోరు నివారింపు మెట్లైనన్.

నామమాత్రమున గద్దెపై నుంటినని
సర్వముతెలిసియు నాపై భారము
మోపుట పాడియే మాధవా!
భారము నీపై నుంచితి చక్కచేయ.

## ఆదిశంకరుడు

భువికి దిగెను గంగ శివుని శిరమునుండి
శివునినామమున వెలసితివి భువిలో అపర
శివుడవో యనంగ ఎనలేని సత్కృతుల రచించితివి
అద్వైతమును స్థాపించితివి ఆదిశంకరా! 1

వెలసె భారతావనిని పీఠములు నలు
మూలల చిరస్మరణీయముగాగ
నిలుచు నీపేరు భువిలో శాశ్వతముగ
యిలన్ లేరు నీవంటి దివ్యపురుషులు మున్మాటికిన్.

---

## గౌతమబుద్ధుడు

దశావతారపురుషా బుద్ధదేవా! నలు
దిశల వెదజల్లినావు నీశాంతిబోధల
లేశ మంతైనలేదు సంశయంబు నీకరుణ
యశము జేకూరె ధరణి శాశ్వతముగ. 1

కరిగె నీమనసు దీనుల జూచి
పరివర్తన జెందినావు రోగుల కడగండ్లకు
సిరులపై వ్యామోహము వీడినావు
అర్ధాంగిని కొమరుని వీడి త్యజించినావు సర్వము. 2

## శ్రీరాఘవేంద్రస్వామి

మంత్రాలయమున సమాధిజేరిన
యతీంద్రా! శ్రీరాఘవేంద్రా! మా
నుతుల నందుకొనుచు పుణ్యాదే
వతామూర్తీ! మమ్మాదుకోవయా భవ్యచరితా!

—

## కిరీటంలేని రాజులు

కనె నాంధ్రమాత ముప్వురు కవిరాజుల
తెనిగించె భాగవతము బమ్మెరపోతరాజు
ఎనలేని భక్తికీర్తనల రచించె కాకర్ల త్యాగరాజు
ఘనమైన రామాలయము నిర్మించె కంచర్ల గోపరాజు.

—

## భారతావని

ఉన్నతశిఖరము కల్గిన మహోన్నత దేశము
ఎనలేని రీతిని ఘనతవహించి రెందరో
కనివిని ఎరుగని త్యాగధనులు
కానరాదెందు భారతావనికి సాటి.

—

# తత్త్వం

తత్వంబు దెల్పెద వినుడు
తనివితీర ఈమాయ కాయమునకు
విలువ జీవ మున్నంతదాక నిలువదిలన్
క్షణమైన ఋణము దీరినపిదప. 1

దైవమును నమ్మిన నిరంతరసుఖము
ముక్తినందెదవు నిశ్చయముగ
దురాశపడకే ఓ మనసా
దురాశపడిన చేటుకు మూలము
కరుణామూర్తిని కొలచిన చే
కురు సకలసౌఖ్యములు నమ్ము మున్మాటికిన్. 2

రేపు మాపన్నావు మనసా
ముందు ఏమున్నదో తెలుసా నీకు తెలుసా
నాది నా దన్నావు మనసా
ఏది నీదికాదు మనసా
మాయలో పుట్టావు మనసా
మాయలో పెరిగావు మనసా
మాయలో గిట్టేవు మనసా
మేలు చేసినకలుగు విజయము
కీడుచేసిన కడగండ్లు తప్పవు
మోసపోకుమ నమ్మి నరులన్
మోక్షమందుమ నమ్మి శ్రీహరిని.

బంధువులు పేరుకే
వాహాకులె మిత్రులు
కట్టెలే చుట్టాలు
కాష్టమె బంధువు
తెలుసుకోవె మనసా
ఏదిరాదు వెంట
ధర్మ మొకటిదక్క
దానమె కాపాడు
నీతియె నిలుచు జగతిలో స్థిరముగా
తెలుసుకొని మసలుకో మనసా! 1

లోకులనమ్మిన మోసము తథ్యము
లోకనాథుని నమ్మిన మేలుకలుగు
ఏకాగ్రతతో కొలిచినవారికి
ఏకొరతలు కలుగవు నమ్మండీ.

ఏటిపాయలు కలసినరీతి
కలుసుకొంటిమి ఋణమున్నంతదాక
సాగిపోవుదము కలసి మెలసి
కర్మ పరిపక్వ మొందగానె విడిపోవుదుము
ఎరికిన్ చెప్పక జగన్నాటకసూత్రధారుని
లీలలిట్టివెనుమీ తెలుసుకొనుమా.

కలిగినవా రనేకులు
కలుగని వారని దయచూచి
చేయూత నొసగుట కనీస
మానవధర్మము మరువకుడు. 4

ఎత్తితి నెన్ని జన్మములో
ఎత్తనున్నా నెన్నిజన్మములో
తెలియగలేము దైవలీలలు
కనుగొనలేము ముందు వెనుకలు
కానగలేము దైవమహిమలు.

—

## శాశ్వత శయ్య

చేరె నెన్నియో విగతజీవు లిచటకు
చేరనున్న వెన్నియో తెలియజాలము
నిరుపేదలు, ధనికులు, పేరొందిన
వారందరు శయనించు అంతిమశయ్య యిది. 1

వారు వీరన్న భేదభావంబులేక
శరణిచ్చు సువిశాలమైన భూమి
పరమేశ్వరునకు విలాసముతో నాడు
అపనైన వేదిక కడుపేరొందిన పీనుగులపెంట. 2

—

## తెలుగు వెలుగు

తెలుగునాటలేని సహజసంపద లేదు
తెలుగునాట లభించు సర్వము
తెలుగునాడు పుట్టినిల్లు సర్వసంపదలకు
తెలుగునాట పుట్టిరి ఘనులు త్యాగధనులు. 1

నాగేశ్వరరావు, విశ్వదాతన్న బిరుదొందె
టంగుటూరు గుండెజూపె గుండుకు
భాగ్యముల వీడి దేశసేవజేసె తెన్నేటి
భోగములేల యని దూకె స్వాతంత్ర్యసమరాన పట్టాభి. 2

పాలించి రానాడు భరతదేశమును
ఏలికలై రాఘవేంద్రుడు, రామమూర్తి, రెడ్డినాయుడు
అలనాటి పరదేశీయు లిచ్చిరి పదవుల ఏరికోరి
కల్లగా దది వారాంధ్రరత్నములు.

పేరొందె బులుసు సాంబమూర్తి మహర్షని
కీర్తిపొందె పొట్టిశ్రీరాములు అమరజీవని
పరిపాలించిరి కృష్ణదేవరాయ ప్రభృతులు
భారతావనికి తెలుగుగడ్డ మచ్చుతునక. 4

కవులకు కళాకారులకు భక్తులకు పుట్టినిల్లు
కల వనేక ప్రసిద్ధ పుణ్యక్షేత్రములు
మహిమగల మహిళామణులు
ఎడతెగక పారు నదీజలాలు.

## ఆంధ్రశోభ

వినరండి కనరండి తెలుగుశోభ
ఎటుచూచిన పచ్చనిచేలతో శోభిల్లు
ధీరులకు త్యాగధనులకు పుట్టినిల్లు
దానకర్ణులకు దాతలకు పెట్టిందిపేరు. 1

ఎడతెగక పారే నదులతో
అపురూప శిల్పసంపదలతో వెలసింది
కొదవలేని ఖనిజాలతో అందరికి తిండిపెట్టు అన్నపూర్ణ
పాడిపంటలతో వర్ధిల్లు పుణ్యక్షేత్రాలు కోకొల్లలు,
అన్నికళల ఆరితేరు కల్పవల్లి
పేరుప్రఖ్యాతుల గాంచిన ఆంధ్రభూమి.

---

## స్వాతంత్ర యోధులు

ఏగి రనేకనిస్వార్థపరులు స్వాతంత్ర్య
సంగరముకు జయము చేకూర్చి లీ
లగ మిగిలె వారిత్యాగము; నిలుచు
యుగాంతమువరకు వారినామము. 1

దాపురించి రనేక స్వార్థపరులు
కపటంబుచే పాలించుచున్నారు అకటా!
కనుపించరు నేడు సారథ్యము సూటిగ సాగింప
దేశప్రగతి ఒడుదొడుకులకు లోనుగాకుండ. 2

## టంగుటూరు ప్రకాశం

ఆర్జించితివి గుప్పెళ్ళతో న్యాయవాదిగ
స్వరాజ్య సమరమున దుమికితివి
సర్వము త్యజించి గుండె లదర గుండె నె
దురు చూపితివి తెల్లవారి గుళ్ళకు.

గర్జింతివి మృగరాజువోలె నీధాటి
కోర్వలేక పలాయనము చిత్తగించిరి పెర
వారు, నిలుచు ధరలో నీనామ మాంధ్రకే
సరీ! చిరస్థాయిగ లేరు నీవంటిధీరులు. 2

—

## ఆంధ్ర దేవాలయాలు

(ముఖ్యమైనవి)

### శ్రీకూర్మం

అలలందు నిలిచి మందరగిరిని మోసితివి
కలియుగమందు శ్రీకూర్మమున
యిల నరులపాపముల బాపగ
వెలసిన కూర్మావతార నమస్సు లందుకో.

—

## అరసవిల్లి

అరయగ అరసవిల్లిని నిలిచిన
ఆరోగ్యదాయకా శ్రీసూర్య
నారాయణా! బ్రోవుమయా వేద
పారాయణా! మా నుతులనందుకొనుచు.

---

## సింహాచలం

సింహగిరినున్న ఆదిదేవా నర
సింహరూపా! భక్తుల నాదుకొనగ నర
సింహ నామముతో వెలసితివయా నీ
సహాయము మాకు సదా చేకూర్చుము.

---

## అన్నవరం

పేరొందినది అన్నవరక్షేత్రము సత్య
నారాయణా! నీఉనికిచే;
కరుణ జూపుము సదా
నరుల నుద్ధరింప నీకు నీవేసాటి.

---

## ద్రాక్షారామం

భీమేశ్వర నామమున ద్రాక్షా
రామమున విలిసిల్లిన దేవా! దురి
తములబాపి నరుల నాదుకోవయా నీ
వె మాపాలశరణు, జగదీశ్వరా.

---

## శ్రీశైలం

భ్రమరాంబదేవితో రాజిల్లుదేవ!
శ్రీమల్లిఖార్జునా! బ్రోవరావయ్యా!
మమ్మాదుకొన నో ఉమాపతి నీ
సామర్థ్యమునకు సాటి లేరెవ్వరు.

—

## భద్రాచలం

భద్రగిరిని నిన్నునిలిపి గోపురము కట్టించె రామా
భద్రా! నీకాంధ్రావని శాశ్వతనివాస
మొందించె భక్తుడు రామదాసు
భద్రగిరివాసా! బ్రోవుము సదాభక్తుల.

—

## విజయవాడ

వెలిసితివి విజయవాడ దరి గిరిశిఖరాన
గలగల మనుచు సదాపారు కృష్ణానదీతీరమున
నిలిచె నీఖ్యాతి వేనోళ్ళపొగడ; నీ
చల్లనిచూపులు ప్రసరింపుము కనకదుర్గా!

—

## శ్రీకాళహస్తి

కరిని, సాలీడును, ఉరగమును
కరుణించి బ్రోచితి వానాడు
నరులను సహితము బ్రోచుటకు
నీకు భారమాయెనా? శ్రీకాళహస్తీశ్వరా!

—

## తిరుపతి

నరుల నాపదలనుండి కాపాడు స_ప్త
గిరిని వెలసిన వేంకట రమణా! సంకట
హరణా! కలియుగమున కడు
పేరొందితివి ముడుపుల నందుకొనుచు దేవా!

---

దశావతారముల ధరించితివి
దశదిశల ఆంధ్రావనిని పలుపేర్లతో వె
లసితివి ఆంధ్రులభాగ్యమో యనగ నీ
యశస్సు కొనియాడ తరమే అవతారపురుషా!

---

## సంస్మరణ

కంటిరి నవసంతానమును
కంటిపాపవలె సాకితిరి స_ప్తశిశువుల
కంటిరి నన్నిరువురు పుత్రికల తదుపరి
కంటిరి నన్నిరువురుపుత్రుల వియోగానంతరమున. 1

కడు సేవలచేసి పెద్దల చేసితిరి
కడుగారాబముగ నందరిని సాకితిరి
కడుపుతీపిని చవిచూపితిరి
కడకు సుఖమొందక కడగండ్ల పాలై_రి. 2

పరులకై త్యాగమొనరించి రెండరో
మీరుకూడ ప్రాణత్యాగముచేసి
తిరి జ్యేష్ఠుడైన నను కాపాడుట
గురించి, ఏమని వాపోదును.

తీర్చుకొనలేకపోతి మీఋణ మేమాత్రమును
దూరమౌటచే తుదకు మీకు
కొఱివిపెట్ట నోచనైతి ఏ
తీరున సరిపెట్టుకొని తృప్తినొందుదు,

మీసహృదయత మీఆత్మీయత
మీసమభావము ప్రేమ ఎనలేనిది
మీసరి లేరెటుచూచినన్ మీ దీవన
లె సదా నాకు శ్రీరామరక్ష.

తుదకు మాతృఋణముకూడ తీర్చుకొన
కొదవాయె దరినున్నను వార్తచేర
క దహనసంస్కారణకూడ చేయ
లేదు జ్యేష్ఠడను నామమాత్రమునకె.

ఏమని తలతు నాయోగము
ఏమని చింతింతు నాదౌర్భాగ్యమునకు
ఏమని నుడువుదు చివరిదశలో
ప్రేమనుకూడ కోల్పోతి సతీవియోగమున.

సుతులు లేరంచు వాపోవలే దేనాడు
పుత్రికలె పంచప్రాణములో యన
చేతనిడి చనెను ప్రియసఖి యశోద
చింతలోముంచి కాన్స రామెను కబళింప. 8

ఏకొరతలేదు భోగభాగ్యములకు
ఏకాకిగ నుండలేక ద్వితీయము చే
నుకొంటి విజయను, చేరితి తు
దకు శ్రీభావనారాయణుని సన్నిధికి. 9

ఆత్మతృప్తి మిత్రుల సహృద
యత కల దమితముగ సదా త
లతు దేవదేవుని చరణముల
గతి యాతడె సర్వజీవులకు నిశ్చయముగ. 10

ఎన్ని దురితములు చేసితినో
ఎన్ని అకృత్యము లింకను చేయ
నున్నానో తెలియజాల జ
గన్నాథుని శరణొందెద మన్నించమని. 11

—

## సతీస్మృతి

పుట్టితివి తలవంశమున
మెట్టితివి బులుసువంశంబును
కంటివి అష్టకన్యలను
చిట్టచివరకు మిగిలిరి పంచకన్యలు. 1

చేసితి వెనలేని సేవల భేదంబులేక
కొనప్రాణ మున్నంతదాక
నీ సహన మెనలేనిది
కొసకు నిన్ను కబళించె కాన్సరు. 2

మరువలే రెవ్వరు నీకలుపు
గోరుతనము నిండుమనముతో నాదుకొంటి వందరిని
మారు మ్రోగెను యూనిట్ ట్రస్టు ప్రతినిధిగ
తారవలె నిలుచు నీపే రేనాటికైనన్ ప్రియయశోదా. 3

—

## పిరదౌశి కవి

తనచరితము లోకము మెచ్చునట్లు రచించ
మని కోరె పిరదౌశికవి నల గజనీ సు
ల్తాను గేయమున కొక సువర్ణ మొహిరీ నిచ్చె
దనని బాసచేసె వల్లెయని పూనుకొనె కవి. 1

రచించె ముప్పదివత్సరములు నల్వురు
మెచ్చునటుల తనజీవితాశ నెరువేరునని భా
వించె గాని సుల్తాను ముదమొందియు
తా చేసినబాసకు బదులు వెండిదీనారముల నొసగె. 2

కవీంద్రుడు నిరాశతో క్రుంగి తిరస్కరించె
కవిని బంధించి తలతీయుమని నుడివె
ఆ వర్తమానము నూహించి విరాగియై
కవి దేశమును విడిచి పరారియాయె. 3

ఫిరదౌశిపట్టి ఖేదించె గుండెలదర
గుర్తించె పొరపాటు మొగల్ నేత
తిరిగిపంపె బంగారునాణెముల
పరలోకయాత్రకు పయనించె ఫిరదౌశి. 4

కుందుచు వ్రాసె మశీదు గోడలపై ఫిరదౌశి
చదువరులు గుర్తించిరి సుల్తాను గజనీ మహ
మ్మదు చేసిన మోసము, లేదు హృదయమాతనికి సోమ
నాథునిగుడి పదునారుసార్లు దోచినకర్కసుడాతడు. 5

---

## జాషువా కవీంద్రుడు

ఇల ఆంధ్రావనిని వినుకొండ
పల్లెలో జనించినావు బడిపం
తులవై నిరాడంబరజీవితము
సల్పుచు విద్యను బోధించినావు. 1

భారతాది గాథల పూర్తిగా బాపోసనపట్టినావు
పేరెన్నికగన్న శతావధాని చెళ్ళపిళ్ళ
వారిచే కాలికి గండపెండేరము
ధరించు భాగ్య మొందినావు. 2

లేరు కవితాలోకమందు నీవంటి
పేరొందిన ధన్యజీవులు యోగివలె నీ
ధర్మం బొనరించినావు నిలుచు నీ
పేరు ధరలోన చిరస్థాయిగ తారవోలె.

లేదువాణికి జాతిమత భేద మటంచు
మోదముగ ఋజువు పరచినావు
చదువరులకు తేటతెల్లము చేయ చాలవే
నీదు ఖండకావ్యాల పాకరుచి. 4

తారలవలె నీకీర్తి ప్రకాశింపజేయ
పిరదౌశికవీంద్రుని చరిత్ర, మొగల్ నేతకు
పేరొచ్చిన తాజమహల్ గాథ, గబ్బిలం,
పురాణగాథలు, రాధేయుని యదార్థగాథల్. 5

కరిపై నూరేగింపజేసి నీకు ఘనసన్మానం బొ
నర్చినారు కవితాలోకమందు
కోరకయే వచ్చెను ప్రతిభ, నీకు
సరిపోలువా రరుదు కవియోగి.

నారాణి వాణియటంచు పల్కె పినవీరభద్రకవి
వరించినవాణి నను వీడిపోవునే అని చ
తురతతో నుడివితివి నినుజూసి అసూయపొందిన
వారి నోళ్ళు మూతపడునట్లు రవ్వలురాల్చి నీ ప్రతిభ
చాటితివి. 7

కలవు బిరుదు లనేకము నీకు
కలియుగ నవచక్రవర్తి, కవి కో
కిల, కవితావిశారద యిత్యాదులు
నిలుచు ధరలో నీపేరు శాశ్వతముగ
కళాప్రపూర్ణుడవై వెలిగితివి తాంధ్రలో. 8

—

## హితబోధ

తలవకు గతించినదాని గూర్చి
తలంచుము నేటిసంగతి
తలువకు రేపటివిషయము
తెలియగలేము దైవలీలలను తదుపరి. 1

వర్తించుము వివేకివై
వర్తించ కజ్ఞానివై
సరిదిద్దుకొను మవకాశమున్నపుడె అపై
పరితపించిన ఫలితము శూన్యము. 2

ఇలన్ శాశ్వత మేదియు కాదు
కలకాలము నిలుచునటుల
సలుపుమేదైన మంచి
కలుగు సురలోకప్రాప్తి. 3

ఆయువు పరిమితము
ఆయువు ముగియకుండ
చేయు మేదైన మంచిపనిని
కాయ మంతిమపయన మొనరించకుండ. 4

సదా దైవమును స్మరింపుము
సదా దానముల జేయుము
సదా ధర్మ మాచరించిన
సదా నినుకాపాడు ధర్మదేవత. 5

రారు నీతో బంధువర్గముల్
చేరవు సిరిసంపదలు
చేరు నీవెంట మంచిమాత్రమె
కరుణజూపు మన్యజీవులపై. 6

కలరు లోకమందనేక రోగులు
వికలాంగులు, నిరుపేదలు
దయజూపుము వారిపై చేతనైన
సహాయముజేసి మానవధర్మము నిలుపుము.

సిరులు, భోగము లశాశ్వతము లీ
ధరణి నెందరో రాజన్యులు, నేతలు
పరిపాలించి చనిరి వింటిమే
వారు చిల్లిగవ్వయైనన్ కొనిపోయిన వార్త.

కాన మసలుకొనుము వివేకివై
కనుము గతసంఘటనలు
వినుము పెద్దల హితవుల
వినకున్నన్ తిప్పలు తప్పవు. 9

---

## లోకరీతి

ఉద్యోగి యున్నతపదవి నొందునే
అధికారి దయలేకుండినన్
గంటము బూనినన్ కవిత్వ మబ్బునే
శారద కృప లేకుండినన్. 1

చూలాలు సుఖప్రసవ మొందునే
మాసములు పూర్తికాక
కరిరాజు ప్రభుకృప బడసెనే
కర్మ పరిపక్వ మైనంతదాక. 2

గతించిన వెన్నియో వత్సరములు
గతించి రెందరో మహనీయులు
గతించ లేదింకను వారికీర్తి
గతితప్పక యశంబు జేకురె కలకాలము. 3

యిల్లాలులేని వసతియు
చూలులేని గోవుయు
వాలములేని పశువు దా
తలులేని చోటు నిరర్థకంబుగాదె. 4

# మారింది కాలం

ఆనాడు భక్తిపరులు మెండు
యీనాడు భుక్తిపరులు మెండు
సృష్టి పెంపొందింప ప్రోత్సహించి రానాడు
సృష్టి నరికట్టుటే ధ్యేయమీనాడు. ॥మా॥ 1

కలరు భోక్త లనేకు లానాడు
కలరు భుక్తి కలమటించువా రనేకు లీనాడు
పంటలు సమృద్ధి ఆనాడు
ఎంతపండినన్ చాల దీనాడు. ॥మా॥ 2

పోషకు లనేకు లానాడు
భేషజము కలవారనేకు లీనాడు
కలరు శృంగారరసికు లానాడు
మిగిలింది శృంగారమే యీనాడు. ॥మా॥ 3

చేరి రున్నతస్థితి కానాడు
చేరి రున్నతశిఖరాల కీనాడు
అదృశ్యరూపులై సంచరించి రానాడు
దృశ్యరూపులై మండలంబుల చేరుచున్నా రీనాడు.

తోలుబొమ్మలాడి రానాడు
సజీవతొత్తు లాడుచున్నా రీనాడు
దాత రెందరో యుండి రానాడు
యమదూతలు మెండు యీనాడు. మా॥

కలదు పాపభీతి ఆనాడు
అంతా మోసపుటూహ లీనాడు
సలిపిరి యజ్ఞక్రతువు లానాడు
క్రతువులుసల్పువారే లేరీనాడు. మా॥ 6

ఏలి రానాడు రాజులు ధర్మచింతతో
ఏలుచున్నా రీనాడు ధర్మచింతనలేక
కలిమిలేముల సమచింత ఆనాడు
కలిమియే సర్వ మీనాడు సర్వులకు. 7

కలదు తిండి మెండు ఆనాడు
చాలదు తిండి ఎంతవున్న యీనాడు
దేశభక్తులు మెండు ఆనాడు
దేశద్రోహులు కొల్ల లీనాడు. మా॥ 8

మితముగా నుండిరి మంత్రు లానాడు
మితిమీరి కలరు మంత్రు లీనాడు
లెక్కకుండెను రాష్ట్రము లానాడు
లెక్కింపలేము రాష్ట్రము లీనాడు. మా॥ 9

త్రాగిన తప్పుగా భావింపబడె నానాడు
త్రాగకున్నన్ తప్పు యీనాడు
తైతక్కలాడిరి సాను లానాడు
శృంగారచేష్ట లొనరింతురంద రీనాడు. మా॥ 10

అన్నగతప్రాణు లంద రానాడు
పానీయగతప్రాణు లెందరో యీనాడు
సింగారమన్న చూడముచ్చ టానాడు
సింగారమను చూడలే మీనాడు. మా॥ 11

కలదు పాపభీ తానాడు
పాపము చేయుటే ప్రధాన మీనాడు
మితముగానుండె కరువుకాటకము లానాడు
అనునిత్యము బీభత్సము లీనాడు. మా॥ 12

తినుటకుకరువై రానాడు
తినుబండారము లరుదీనాడు
రాజులు కొందరే ఆనాడు
అపరరాజు లెందరో యీనాడు. మా॥ 13

ఎనలేని గురుపూజ లానాడు
అంతులేని గురుదూషణ లీనాడు
ప్రతిభావంతులరుదు ఆనాడు
పొగరుబోతులకంతులే దీనాడు. మా॥

దేశప్రతిభ మిన్నంటె నానాడు
ధరలు మిన్నంటె నీనాడు
పన్నులు మితం ఆనాడు
పన్నుబాధకు వెన్నువిరిగె నీనాడు మా॥ 1

త్యాగము చేసి రానాడు నీతికొరకు
త్యాగము చేయుచున్నా రీనాడు పేరుకొరకై
గడించిరి కీర్తి గుళ్ళుగోపురముల కట్టించి ఆనాడు
గుడించిరి గుళ్ళుగోపురము లీనాడు. మా॥ 16

రంగస్థలినాటకాల పేరుపోయెను
సినిమాచిత్రాల కంతులేదు
వీధులతిలకించిరి భామాకలాపము లానాడు
యింటింట కలాపము లీనాడు. మా॥ 17

పాల నీరుకలిపి రానాడు
నీటన్ పాలుకలిపెద రీనాడు
మిద్దెలు మేడలు కొలది ఆనాడు
మిన్నంటే భవనాల కంతులే దీనాడు. మా॥ 18

న్యాయమునకు కొదవలే దానాడు
న్యాయమన్నది కరువాయె యీనాడు
వావివరసల పాటించి రానాడు
వావివరస లసలే లేవీనాడు. మా॥ 19

అడుగంటిరి ధర్మపరులు
వన్నెకొచ్చిరి అధర్మపరులు
అంతరించిరి నిస్వార్థపరులు
అవతరించిరి స్వార్థపరులు. మా॥ 20

కూటికి కరువులే దానాడు
నీటికికూడ కరువాయె యీనాడు
మితముగాకలదు కట్టబట్ట ఆనాడు
అమితముగా కలవు కట్టబట్ట లీనాడు. మా॥ 21

పాటించిరి నోము లనేకము లానాడు
తిలకింతురు 'నోము'సినీమా యీనాడు
చేసిరి కఠినక్రతువు లానాడు
చేయుచున్నారు ఘోరపాపము లీనాడు. మా॥ 22

న్యాయము నాల్గుపాదముల నడిచె ఆనాడు
న్యాయము కుంటుపోయె యీనాడు
నెలకు మూడువర్షములు కురిసె ఆనాడు
అతిఅనావృష్టులకు కొదవలే దీనాడు. మా॥ 23

శంభోశంకరాఅన్న నినాదము లానాడు
శంభో ఎవరికొంపపీకుదు నన్న ధ్యాన మీనాడు
రామరామ అనుచు చేయూతనొసగి రానాడు
రామరామ లేశమంతైనను చూడ రీనాడు. మా॥ 24

మాన మగుపడకుండ కట్టిరిబట్ట లానాడు
మాన మగుపడుటయే ధ్యేయ మీనాడు
కట్టు బొట్టుతీరులు పరువునిలిపె ఆనాడు
కట్టు బొట్టుతీరులు పరువుతీసే యీనాడు. మా॥ 25

ఆనాడు కరువుకాటకాలు మెండు
ఈనాడు ప్రమాదపు చావు లనునిత్యం
ఆనాడు కలరా, ప్లేగు, మశూచికాలు మెండు
ఈనాడు ప్రమాదాలు కొల్లలు. మా॥ 26

ఇళ్ళునిలబెట్టి రానాడు ఎటులైనన్
యిండ్లు కూలదీతు రీనాడు ఎటులైనన్
కలిసివుంటే కలదు సుఖం ఆనాడు
కలిసిఉంటే కలుగు దుఃఖం యీనాడు. మా॥ 27

సిగ్గు ఎగ్గులు పాటించి రానాడు
సిగ్గు ఎగ్గులులేక సంచరించెద రీనాడు
సహాయముచేయ సాహసించి రానాడు
సహాయమన్న ఊరువిడిచి పోదు రీనాడు. మా॥ 28

మొడ్పులుచేసి రానాడు భక్తితోడ
ముడుపులుకట్టెద రీనాడు కార్యసాధనకై
వర్ధిల్లిరి పుణ్యజను లానాడు
వన్నెకెక్కిరి పుణ్యదూరు లీనాడు. మా॥ 29

కొడుకులన్న సుఖ మానాడు
కొడుకులు కొరకంచులై రీనాడు
కోడలు దేవతామూర్తి ఆనాడు
కోడలన్న కలుగుభీతి యీనాడు. మా॥ 30

బ్లాకులు కొద వానాడు
బ్లాకుమార్కెట్లు నిండె యీనాడు
పాలకు లేదు కొరత ఆనాడు
పసిపాపలకుకూడ పాలడబ్బాలె గతి యీనాడు. మా॥ 31

ఎటువిన్నన్ ఈశ్వరశ్రవణంబు లానాడు
ఎందుపోయినన్ ఎల్. ఆర్ ఈశ్వరిపాట లీనాడు
రామనామస్మరణ మెండు ఆనాడు
సినిమాతారల నామజపంబె ఘనత యీనాడు. మా॥

—

## దీవెనెలు

(మరదలు చి॥ సౌ॥ లక్ష్మీశారద వివాహ సందర్భమున
కూర్చిన పంచరత్నములు.)

వన్నెగల వంశమున వెలసినావు
కన్నెగా పెరిగితివి ఇన్నినాళ్ళు
మిన్నంటె నీపేరు ఆకాశవాణిలో
అన్నెము పున్నె మెరుగనటుల సాగె నింతవరకు.

కోల్పోతివి జనకు నేనాడో
తల్లి వీడెలోకము నీకళ్యాణము చూడ నోచుకోక
కలసి మెలసితివి రుక్మిణక్కతో యింతదాక
పాలు నీరు కలసినటుల సాగిపోవమ్మ ముందడుగువేసి. 2

కలవు నీకు రెండు దివ్యనామములు
కలిగె నేనాడో చదువులతల్లి కటాక్షము
కలుగ జేయును సిరినికూడ సిరులతల్లి
పాలు పొంగెనరీతి పొంగుగాక నీ భావిజీవితమ్మ. 3

చదువు నేర్పితివి నేటివరకు
చదువులలోటు తీర్చుకొను మీనాటినుండి
అదురు బెదురులేక సాగిపోవుచు
దిద్దుకోవమ్మ నీ కొత్తకాపురంబు. 4

కూర్చితి నీ పంచరత్నముల
నెరవేరెను నాదుకోర్కె యీనాటికి
కరుణచూపును సదా రాముని నమ్ముకొన్న
కరముెత్తి దీవించు చున్నాము వర్ధిల్లుడమ్మ. 5

(ఇట్లు ప్రేమతో దీవించి సదా శ్రేయముకోరు
నీబావగారు బులుసు భావనారాయణ.)



# సమస్యా పూరణం

(వేదము, నాదము, మోదము, పాదము)

వేదములు విరించి నుడువగ
రుద్రులు పంచాక్షరీనాదము చేయగ
మోదమలర అంబికాపతి తన్మయుడై
పాదములతో లోకము చలించగ నాట్యమాడె.

(వనము, మనము, కనము, జనము)

వనమున వశించే జీవులపై
మనము కరుణ జూపవలె
కనము ఉగాది సరి పర్వదినము
జనము వేడుకలు సలుపగ.

—

# పశువుల గోల

తరతరాలనుంచి మా సేవ లందుచున్నారు
కరుణజూపుడు మాపై
తరలించకుడు మము కసాయికడకు మా
మొరాలించి విడువుడు దయార్ద్రులై.

—

## గొఱ్ఱెల, మేకల మొఱ

ఆకు లలముల మేసి బ్రతికెడు అమా
యకజీవులము, నిర్దయులై
మా కుత్తుకల కోయకుడు
మీ కడుపులు నింపుకొని విందారగింప.

—

## పుష్పాక్రందన

దైవలీలచే జనించినాము భువిని
దైవమున కంకితమైన చాలు చాలు మా
నవాలంకరణ మాకు వలదు వలదు
దేవపూజకు వినియోగమైన మాదు జన్మసఫలీకృతంబౌను.

—

## ప్రకృతి తాండవం

### (1977 నవంబరులో ఆంధ్రలో సంభవించిన పెనుతుఫాను)

వింటి మేనాడో బందరున ఉప్పెన సంభవించెనని
కంటి మీనా డాంధ్రావనిని పెనుతుఫాను
కటకటా ఏమని నుడువుదము కడుయి
క్కటల పాలై అసువుల కోల్పోయి రెందరో. 1

పోయె పాడిపశువు లెనలేనిరీతి
పోయె పాడిపంటల శోభ
పోయె పక్షులును మితిమీరి
పోయె యితరజీవులెన్నో తెలియలేము. 2

నాశనమాయె పంటభూములు
నాశనమాయె సేద్యము సర్వము
నాశనమాయె వృక్షములు
నాశనమాయె వసతులుకూడ. 3

వర్ణింపగలమె జీవుల దీనావస్థ
వర్ణింపలేము ఆర్తనాదము
వర్ణింపతరమె జలాక్రమణ
వర్ణింపశక్యమె ప్రళయ మహిమ. 4

పలికిరి విబుధులు కల్పాంతమున
కలుగు ప్రళయ మంచు
కలిగెను ప్రళయము హఠాత్తుగ
కలి అంతమొందువేళ ఆసన్నమాయెనో యన. 5

కర్తవ్యము ప్రతిమానవున కాదుకోగ
శరణార్థులను చేతనైనరీతి
కరుణజూపుము సమయ మిదె
సిరు లస్థిరములని వేరె నుడువనేల. 6

భేదముల మాని సకలసేవల చేయుడు
బాధల నుపశమింపజేయ కరుణతోడ
విధాత ఏలకో కినుకవహించె కాబోలు
విధి నెదుర్కొన శక్యమె యేరికైనన్. 7

---

## ఆంధ్రలో యిటీవల సంభవించిన
## తుఫాను బీభత్సం (1990 మే నెల)

అకటా! పెనుతుఫా నాంధ్రావనిని
వికటాట్టహాసమో యన మరల ప్రబల
శక్తితో బీభత్స నాట్యమాడి
కూకటివేళ్ళతో కలచివైచె సర్వము.

పలు కడగండ్ల పాలైనది ప్రజానీకము
కలనైన తలవనిరీతిగ పంట
పొలములు నాశనంబాయె దైవ
లీల లేమని వర్ణింతుము.

---

## పాకరుచి

బలే బలే వంటలు నవరుచుల పాకాలు
బలేదూరు నాముందు పాకశాస్త్ర కోవిదులు
ఒకమారు మావంటకాలు రుచిచూసారంటె
కలకాలం మమ్మొదలరండి మీయోగం బాగుంటె

మాపాల బడతారు లేకుంటే పోతారు
మీఖర్మమండీ మంచో చెడో తేల్చుకోండి తక్షణం
ఆహ కొత్తిమిరికారం పప్పుచారు మాప్రత్యేకతండి
ఆవడలు, సేమియాపాయసాలు తినిచూడండి
వంకాయ మెంతిపెట్టి, బెండకాయ వేయించి
టమాటో ఆవకాయ, ఆపైన ఆకుకూర పులుసు
మరుజన్మకైనా మరువ లేరండి రారండి రారండి.

—

## ప్రేయసికి లేఖ

అందినది నీప్రేమలేఖ ప్రేయసీ! నీ
మధురభావములెల్ల గుప్పించినావు
పొందుపరచి, నా భాగ్యమేమని తలంతు?
ముదంబొందితి కడు, నాదశకు వేరె పలుకులేల?

వెలసినాను నీకళ్ళలోన
నిలిచేవు నా గుండెలోన
కలసిపోయి ఏకమౌదుమా
కలకాలం సుఖముగా సాగిపోదమా!

కలసితిమి చిన్ననాట
కలసిపోతిమి కాలక్రమాన, తీగె
ఓలె పెంపొందె మన అనురాగము
చిలువలు పలవలై ఫలించె యీనాటికిస్.

ఏకమైపోవుదమా ఏనా
టికైనన్ వీడని బంధమై
లోకులేమి భావించినన్ చి
రకాలము నిలుచు మనచెలిమి. 4

—

## ప్రేయసి ఆవేదన

రావోయి ప్రియా, బిరాన రావోయి
తాళజాల విరహము, చేసుకొనుము స్వంతము
జాలమేల జేసేవు త్వరితముగ రావోయి
కనికరించి కరుణజూపు కన్నియను
విహరింతము రావోయి హాయిగా
తేలిపోదము సుఖములా, స్వర్గసీమలా. 1

వసంతగీతము పాడుదమా
వలపు తేనియల గ్రోలుదమా
గగనసీమల తేలి విహరించెదమా
ప్రణయ సామ్రాజ్య మేలుదమా! 2

నీవులేని బ్రతుకు నీరులేని నావ
నమ్మి నామాట నెమ్మనమున
నిక్కముగ మాటలు వేయినేల
నీపై మక్కువ మెండు దైవసాక్షిగ. 3

ఎవరే యీ మొనగాడు
మానసచోరుడు మనోహరుడు॥
నను వలచి విచ్చేసిన సుందరుడు
మన్మథుడా జయంతుడా వసంతుడా యింద్రుడా చంద్రుడా
నవమోహనాకారుడు చెలికాడు
తెలియజెపుమా ఓసఖియా
మోమాటము వలదుసుమా
ఏకాంతముగా దరిజేరి 5
నా ప్రేమను తెలియ జేయుమా
ఆదరింపుమను, సానుభూతితో
నిరాకరించిన మనలేను సుమీ
విరహబాధ నెటులోర్తునే సఖీ యీ బాధబాపు
భారము నీదెసుమీ నన్నెటు ప్రియుని దరిజేర్తువో. (

—

## రాజకుమారి - చెలికత్తె

రాకుమారి : కలగంటినె చెలి కలగంటినె
చెలికత్తె : వివరించు మరి
రా॥ కు॥ ఏమని వివరింతుసే నోరాడ కున్నదే
చె॥ మరైతే నాకు తెలియడమెలా
రా॥ కు॥ మోహనాకారుడే
అతను నవమోహనాకారుడే
చె॥ ఓహో అలగా?

రా॥ కు॥ చెంతకు చేరెనే

నాచెంతకు చేరెనె

చె॥ చేరి?

రా॥ కు॥ కౌగిట చేర్చెనె

తన కౌగిట బంధించెనె

చె॥ తదుపరి

రా॥ కు॥ చెక్కిలి ముద్దాడెనె

నాచెక్కిలి ముద్దాడెనె

చె॥ యింకా

రా॥ కు॥ అధరముల కలిపెనె

మా అధరముల నొకటి చేసెనె

చె॥ చేసి

రా॥ కు॥ ఉక్కిరి బిక్కిరాయెనె

ఊపిరి సలుప దాయెనె

చె॥ అటుపైన

రా॥ కు॥ ఏదో సందడాయెనె

ఆసందడికి నను విడిచి బాసెనే

చె॥ బాగానే వుంది

రా॥ కు॥ మరువ లేకున్నానె చెలి

ఆ అనుభూతి మరుపురానిదె

చె॥ అయితే నన్నేమి చెయ్యమన్నావు

రా॥ కు॥ ఎటులైన పెదకవె
నాప్రియుని దరిచేర్చవె

చె॥ మరైతే ముందుగా బహుమతి తీయాలి

రా॥ కు॥ యిదుగో తీసుకో.

—

## విరహం

రావా నాప్రియా
దరి చేరరావా నాధా
బిరాన చేరరావోయీ
నా చింతదీర్చి పోవోయి
నీవుదక్క నాకన్యు లెవరులేరు
పరిహాసముగా దిది
నిక్కముగ నీవె నాగతియని నమ్మితిన దానను
సహింపజాల జాగును విసిగించకోయీ
పెరవారి మాటలనమ్మి ద్రోహము చేయకోయీ
భరింపజాల విరహబాధనూ
నాసామి రావోయి జాగుసేయక
సుఖించి తేలుదము స్వర్గసీమలో.

—

## కోమలి మనోభావం

పూచింది యీకుసుమం నీకోసం
వేచింది యీకోమలి నీకోసం
దోచుకోవోయి నాలోని సర్వము
దాచుకొనకోయి నీమగసిరి. 1

కలసి వచ్చింది కాలం మనకోసం
తెలుసుకొనవోయి కన్నె మనసు
తెలుపవోయి నీ భావము
కలుసుకొని సుఖముల తేలుదము 2

మరునిబాధ కిక తాళలేనోయి
మరుక్షణ మెటులుండునో తెలియజాలము
కరుణజూప రావా ప్రియసఖా!
మరుపురాని లీలల తేలిపోదమా! 3

---

## దేశభక్తి ప్రబోధము

దేశమంటే వేరుకాదు
మనుజుల కాలవాలము
అందులోనే వారిమనుగడ
సేవచేయుము చేతనైనంత
అనుభవించు దేశసౌభాగ్యన్ని
త్యాగము చేయుము దేశోన్నతికి

తలపకు మనకు దేశం ఏం చేసిందని
తలుచుకో దేశానికి నువ్వేమి చేసావో
చేయు మేదైన లోకోపకారమైన పనిని
నిలుచు నీపేరు ధరలో శాశ్వతముగ.

—

## శంకర స్తుతి

శంభోహరహరశంకరా నమో నమో
భోలాశంకరా భక్తులబ్రోవుమా " "
మంచుకొండపై వెలసినదేవా " "
పాపహరణ పార్వతీపతే " "
నందివాహనా నరులకాపాడు " "
గరళకంఠా గణపతిపితా " "
ఉరగభూషణ ఉమాపతీ " "
కరిచర్మధారి త్రిశూలపాణి " "
ఫాలలోచనా మన్నింపుము " "
కపాలధారీ కరుణజూపుము " "
రావణసన్నుత రాక్షసవినుత " "
ప్రమథగణ సేవిత గంగాధరా " "

—

## ఏడుకొండల స్వామి

ఏడుకొండలపై వెలసినదేవా
వడ్డికాసుల వాడవని నామమిడిరి
వేడుకొనుచున్నాము మమ్మాపదలబారి కా
పాడరావా దేవాధి దేవా! 1

నీదర్శనము చేయ వేలాదిభక్తులు
సదా చేరుదురు నీగిరిపై ఎన్నియిడుమూల పాలైనన్
ఆదుకోవయా దీనులను
మోదమలర వైకుంఠవాసా! 2

లేదు నీసరి దైవము కలియుగ మందు
ఏడుకొండలవాడా
వడ్డికి వడ్డి గుంజుదవట
మెండుగ అర్పించు కానుకలు చాలవనునట్లు. 3

---

## మంగళం

మంగళం వేదవేదాంత వేద్యునకు
మంగళం నిగమాంతవేదికి
మంగళం ఆదిమధ్యాంతరహితునకు
మంగళం విశ్వరూపునకు నిత్యశుభమంగళం

---